# సూ ర బా ల

గ్రంథకర్త:

నెల్లుట్ల రామకృష్ణామాత్య దిట్టకవి.

ఏమె యేప్రేమ నెవ్వాని కే[illegible]
చెప్పెడి కవీంద్రుని[illegible]
ఆమె యాప్రే[illegible]
యింక నీ య[illegible]మ్మగువాఁడు.




ఏ యహంభావమున నెంద తెట్లజూచి
నా కవిత్వంబు నెంతగ నవ్వరొక్కొ!
ఆంధ్రశారద నా నామమాలకించి
పాడదే నన్ను తనదు విపంచిమీటి?

ఫిబ్రవరి 1942

స్వస్వామ్యములు కృతిపతివి] [వెల 0—12—0

# గ మ ని క

ఈ కావ్యములో నొండు రెండు తావుల గణభంగమును, యతిభంగమును, మఱియు స్థానుస్వారము లుండవలసినచోట్ల లేకుండుటయు, నుండఁగూడని పట్ల నుండుటయు, కొన్ని యచ్చు తప్పులును నిర్లక్ష్యమునంజేసి దొరలినవి. వీని నన్నింటిని ద్వితీయ ముద్రణమున నెట్లనేనియుఁ జక్కఁజేయవలసియుంట నందునఁ గూర్చి నిప్పు డేలాటి సవరణపత్రము ప్రకటింపఁబడలేదు. ఇఁక సహజముగ వచ్చిన భాషాదోషములా? అవ్వి యెవ్వాని కవిత్వ మున లేవు? వానిలెక్క యేమి? ఇందున కెవరయిన నవ్వె దరా? వారు కవిని మించి నవ్వలేరు. కవి పిచ్చివాఁడు. అంగా నను నేను సహజ కవినంట. కవిని కవియో యర్థము జేసికొన వలెను.

నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ?
నాయిచ్ఛయేగాక నాకేటివెఱపు ?

అని మా కృష్ణశాస్త్రి

కావున నాకవిత్వమునకు సంతోషించినవాఁడే నన్ను గౌరవించుగాక ! పండితగర్దంబులతో నాకుఁబనిలేదు. ఇట్లనే నాతో వారికిని.

నెల్లట్ల.

# ఒప్పగింపు.

ఓయి! జామున! కంటినీరుబికిరాఁగ
జెప్పుకొను దొక్కమాటను చిత్తగింపు
మెపుడు నాకృతికన్య నీ కిచ్చినానొ
యపుడె యద్దానిపయి హక్కులన్ని నీవ.

ఏదొ నీమదిఁబెట్టి నాయీ తనూజఁ
జిన్నచూపులఁజూడ యోచింపకయ్య!
ఓప దవమానమింత నియోగిబిడ్డ
హృదయమునుజీల్చి పూజ లర్పింతుగొనుము.

ఈవు నీలోనసకలంబు నెఱుగుదయినఁ
గన్నకడుపాటఁ జెప్పెదో యన్న! వినుము!
ఎట్టులీ పిల్లనిన్నుఁ జేపట్టినదియొ
అట్లె యాప్రేమ దానినీవరయవలతు.

ఔర! కృతికన్యనే భర్తఁజేరబంప
నామనంబున కింత దైన్యంబయేని
యింక మా "వసురాణి"యత్తింటికేగ
నెట్లు వాపోదునో యేమొ యెఱుఁగలేను.

— వెల్లల్లి



# రెండు మాటలు.

ఇప్పటి కిప్పుడే కవిగారితోను, వారి కావ్యంతోను పరిచయం కలిగిన ఆనందంతో, రెండుమాటలు చెప్పకుండా ఉండలేక పోయినాను.

ఏదో ఆవేశం కవి రసనాంచలంపైన నృత్యంచేసి, ఒక్క శ్వాసలో కావ్యమంతా వ్రాయించిందేమో ననిపిస్తుంది; ఆధోరణి.

భాషాప్రాగల్భ్యానికి ప్రాకులాడకుండా, కేవల కథా దృశ్యం కనిపించిన ఉద్వేగంతో కావ్యరచన కారంభించిన ఈకవి పుట్టుకతోనే కవిగాజన్మించి ధన్యతముండైనాడని భావిస్తున్నాను.

యథోచితమైన సాహిత్యపరిజ్ఞానంతో, ఆంధ్ర కవితామ తల్లి పాదార్చనకు తెన్నులు గల్పించుకొనే రామకృష్ణామాత్య కవి, తెలుగు రసికలోకంయొక్క ఆదరాన్ని అచిరకాలంలో సంపాదించుకోగలడు.

ఊటుకూరు సత్యనారాయణరావు.



# తెలివిడి.

ఈ సూరబాల పీఠికయందిపుడు విడిచిపెట్టబడిన 17, 18, 19, 20 పుటలు నన్ను కంటగించెడివారల నుపాలంభించుట నుండు. ఈయడావుడి యంతయు కేవల మల్పబుద్ధుల పనిగా నాయంతరాత్మ ప్రబోధించుడా పద్యముల నన్నింటిని దీసివేయ నయినది. అందునుండి మచ్చున కొకపద్యము.

కొమ్ములకోడెలున్న తమ కోపమువోవఁగవచ్చి కుమ్మిక
య్యమ్ముననాకలంబు పసనార్పఁగవచ్చునుగాక చచ్చుట
మ్మమ్మలముందు నుత్తరకుమారుని ప్రజ్ఞల నేమొయాడునే
మమ్మిదియేమి? సిగ్గు! యధమాధములందు రనీతికోవిదుల్.

ఇట్లనేయింకఁ దక్కినవాని కూహింపనగు. ఇదియంతయు నెందులకు వచ్చినది? సత్యమున మనసొమ్ము పదియార్వన్నె మేల్పసిండియే యగునేని దానింగూర్చి యెవ్వరేమన్ననేమి? నేఁడునేనింతవాఁడ నంతవాఁడనని యెంత పెద్దగాజెప్పికొని ఎన్ని గ్రంథములు ప్రకటించిన నేమివచ్చు? అంతనే వారు మహాకవులగుదురా? అది యసమర్థులపని యనుట గాక మీదుమిక్కిలి యట్టివారల నల్వురు నవ్వుదురేమో!

నెల్లుట్ల



# అభిప్రాయము.

శ్రీ నెల్లుట్ల రామకృష్ణామాత్యుఁడు వ్రాసిన 'సూరబాల' వారు దయతోనీయగా చదివితిని. వారు నన్ను దానిమీఁద నొక యభిప్రాయమునుకూడ వ్రాయవలసినదిగా కోరినప్పుడు వారికి నాయందుఁగల యభిమానమునకు కృతజ్ఞుఁడనైతిని. ఈయనయందు మంచి కవితాశక్తి కలదు. సులభమై యోగ్యమధురిమకలదై, వీరశైలి చక్కఁగా నున్నది. కవితాగుణములుకూడ చాలఁ గలవు. ఈ కృతి కవికోకిల జాషువాగారి కంకితమగుట పసిడికి తావి యబ్బినటులున్నది. ఈ కవిగారికి నా యనేకాశీర్వాదములు. వారు దీర్ఘాయువులై యింకన బహుకృతుల వెలయింతురుగాక.

బెజవాడ,
16-3-41.

విశ్వనాధ సత్యనారాయణ, ఎం. ఏ

---

"చక్కని సమన్వయము"

"బ్రతుకులో చావు, ప్రేమలో భగ్నఫలము
చెలిమి పగ సముద్రమున నాకులపు పోటు
కలహాకారుల ఘోర ముష్కర ప్రవృత్తి
చూడనో దేవ! నాకిమ్ము శూన్యదృష్టి."

* ఆర్. వి. జి. రామారావు. బి.ఎ.

---

* వీరికి 'స్మారబాల' ప్రతియొకటి ప్రత్యేకింపఁ బడినది. చిరునామ ?

శ్రీ పరమేశ్వర దేవతాయైనమః

మ॥ రా॥ రా॥ శ్రీ నేలటూరి రామకృష్ణామాత్యకవి.

ఈయన కవిత్వము నేను నాల్గుమాసముల నాఁడు బెజవాడకు—'శివభక్తి' గ్రంథమును కృతి నిచ్చుటకు రైలున వెళ్ళుచుండఁగా నందుటచే రైలులో చదువుట తటస్థించినది. అది నన్నుంగూర్చిన కవిత్వమే. నేను కోపగింపవలసిన ప్రసక్తి దానిలో చాలఁగలదు. అది అట్టిదియైనను ఆ రచనయందు కవికి ఉండవలసిన ప్రధాన గుణముండుటచేత నన్నది ఆకర్షించినది. ఆ యీ మాట ఈయన పశ్చాత్తప్తుఁడై నన్ను సందర్శించుటకు మా గ్రామము వచ్చుటంబట్టి నేను వ్రాసెడిది కాదని. బెజవాడలో గూడూరి వియన్న, తుర్లపాటి గోవర్ధనరావు ప్రభృతులే కాక, కాటూరి వెంకటేశ్వరరావు మొదలైన మచ్ఛిష్యులు పలువు రెఱుంగుదురు. నేను, నన్ను దూషించుచున్నను మెచ్చుకోవలసివచ్చిన గుణ మేదియనగా—

తన్మయత్వము. (ఆవేశము) ఇది కవికి ముఖ్యముగా నుండఁదగినదని నాయాశయము. ఆగుణమున్న కవిత్వమే పాఠకులను తత్తద్ఘట్టముల యందు ఆ యా చోట్లకుఁ దీసికొనిపోయి మైమఱపించును. ఆగుణములేని కవిత్వము, ఎన్ని శబ్దార్థాలంకారాలతో నిండినను అదివట్టిపిప్పి. ఇతఁడు నేనుమీసములు పెంచుటకు ఆగ్రహించుచు నన్ను ధిక్కరించు తలంపుతోఁ బదునొకండు అఱటావులు పద్యములతో వ్రాసిన దిట్టకవి. ఆ పద్యములలో నుండి కొంచె మిచ్చుట లోగడ నుటంకించిన గుణము కలవి చూపుచున్నాఁడను.

1. "ఎవఁడురా? మాయమాత్యుల నీసడించి
కలము నడిపెడి మొనగాడు తెలుఁగునేల?"

2. "భారతీదేవి బ్రతుకు మావలనఁగాక
యెవ్వరుండిననేమి? పోయిననదేమి?"

ఇట్టివి దానిలో తన్మయత్వమును తెల్పునవి చాలఁగలవు. నేను నన్ను తిట్టినను కవిత్వమునకుండ వలసిన గుణమున్నచో మెచ్చుకొందునను నంశము మాగీరతము జదివినవారికి గోచరించును. తిట్లకేమి?

ఉ॥ 'తిట్టుట నాకు సమ్మతమె తియ్యనిపల్కులు మెల్మిశయ్యయుఁ
బెట్టిన కైతయేని' 'గీరతము' మొదటిభాగము

ఇతఁడు సహజకవి. దానికై సర్వస్వమును ధారపోయు వాఁడు. జాషువకవి కవిత్వమునందెక్కుడు నాదరముకలవాఁడు ఆయనకు 'సూరబాల' కృతినిచ్చి వరకట్నముగూడ హెచ్చుగ నిచ్చెడువితరణశాలి. మితిమించినయాత్మాభిమానముకలవాఁడ నాకు రిజిస్టరుచేసి పంపిన పద్యముల శైలివలననే సహృదయుల గ్రహింపఁగలుగుదురు.

'శత్రో రపిగుణా వాచ్యాః'

చిన్నవయస్సువాఁడు. గుంటూరు వివాదములకుఁగ బీజమెఱుంగక నన్నుఁ గొంత ముదురుపాకములో దూలనాడి నాఁడుఁగాక. నాయందుఁ బరమాదరముగలవాఁడు గా అన్యుఁడుగాఁడు. ఆ యీ యంశము నేనితని రిజిస్టరుత్తరమున

జవాబుగా వ్రాసిన 'కవిలతత్త్వములు' అను వ్యాసము సందుంగూడ నున్నట్లు జ్ఞాపకము. అది నేట రేపట పత్రికలో రావచ్చును. నేను పంపి మూఁడు మాసములైనను మఱికొన్ని నావ్యాసములయిన పిమ్మటగాని దానివంతురాక ఆలస్యమైనది. నేనితనిని మనఃపూర్వకముగా నాశిష్య ప్రశిష్యులతోఁ పాటు దీర్ఘాయురారోగ్య భాగ్య సమన్వితుండై కవితాద్వారమునఁ బెద్ద పేరుగలవాఁడగుతమని యాశీర్వదించుచున్నాఁడను. *కొంత అమాయకత్వమీతనిని తన్మయత్వమునకుఁ బురికొల్పును. కాని అదియే లేనిచో నితని కవిత్వము నింతగౌరవింపవలసిన ప్రసక్తి కలుగదు. సర్వథా భగవతి మదుపాస్యదేవత యితనికి శ్రేయోదాయిని యగుఁగాక.

ఇట్లు
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతావధాని.

---

* తన్మయత్వమున కమాయకత్వమే కారణమనియు, నది ప్రతికవికి ముఖ్యమైనదనియే శాస్త్రిగారి మతము.

# సహృదయాంధ్ర లోకమునకు

ఒకానొకప్పుడు నాకు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటకవులు చెప్పికొనిన "ఏనుఁగునెక్కినాము" "దోసమటంచు నెంచియు" ననెడి రెండుపద్యములు చదువుట తటస్థించినది. అప్పుడు "ఏనుఁగు నెక్కినాము" పద్య మితర కవులనెల్ల పెంపేదలుగఁ జేయుచున్నట్లును, 'దోసమటంచు నెంచియు' పద్యము సంస్కృతాంధ్రకవిత్వములఁ దమతో నెవ్వఁడును రాలేడనుటనే నాకు దోఁచిన యర్థము. సంస్కృతముతో నాకుఁ బ్రసక్తిలేదు. ఇందునకు నేను నాల్గుమాసములకిందట మా పూర్వకవులే నేనుగా బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిమీఁదఁ బెద్దయెత్తున దండెత్తినాను. అందునకు వారా పద్యములు నాపైకి వచ్చిన వారికేతప్ప, పూర్వకవుల వఱకేలపోవు? నేఁటి యితర కవులకుఁ గూడ నేరికన్వయింపవు. నాభావము సరికాదన్నట్లు బెజవాడలో నాకు దెలిసినది. దీనిమీఁద నేను పశ్చాత్తప్తుఁడనై వారి దర్శనార్థము 'కడియము' పోయినాను. అట నన్ను వారు మూఁడు పూటలవఱకు నిలిపిరి. నన్ను వారు చక్కగా నాదరించుటయే గాక నా వచ్చునపుడు తమ రచించిన గ్రంథములనేకములుగ నిప్పించి యెంతయు వాత్సల్యముతో సాగనంపినారు.

ఇంతకు మూఁడు మాసముల ముందే వారు నా పద్యములకు సమాధానముగా "కులతత్త్వములు" అను శీర్షికతో పత్రిక కంపినారఁట. అది నేఁడో రేపో వెలువడునుకూడ. "ఇట్టితరి వారినిగూర్చియున్న నీ పద్యములు మాత్రమేల ప్రకటింపరాదు?

కార్యము లేక కారణ మెట్లుండును?" అని యెవ్వరయినఁ బ్రశ్నింతు రేమో! ఈ ప్రశ్న మెంతయు న్యాయ్యసమ్మతమే యయినను నిప్పుడా పద్యములఁ బ్రకటించుట నా కిష్టములేదు. ఏలయన నా చేసికొనిన యత్నమునకు వారి భావము సరిపడనప్పుడిఁక నా పద్యములు ప్రకటించి యేమి ప్రయోజనము? తుదకు వారు నా కవిత్వము నైనఁ దిరస్కరింపవచ్చునో యప్పుడు నేను నా పూర్వకవులఁ బేర్కొని వారి నెంతగా దూలనాడి నేనెంతగా నతిశయించినను నాకుఁ జెల్లును గాక! ఊరక నాకు నేనయి యెవ్వారి పయి నేలనద డెత్తి? అందున కే ప్రాజ్ఞులు సమ్మతింతురు? ఇంత కాంధ్రకవిత్వమున మొనగాడు నియోగియనుట కెవ్వఁ డంగీకరింపఁడు? "దేశభాషలందుఁ దెనుఁగులెస్స" ఇత్యాద్యాభాణిక ఫణితినుగా దేదీప్యమాన దివ్యమంగళ సుధామూర్తిం గావించిన వారు నియోగి బ్రాహ్మణులు కృతజ్ఞత లేనివారికి పురోవృద్ధి యుండదు" అని మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయ శాస్త్రిగారు. మఱియు "నాంధ్రభాషా కోవిదులై యుత్కృష్ట గ్రంథ రచనము గావించి కవిబ్రహ్మలై కవిసార్వభౌములై తమకుఁదామె సాటియననొప్పి కీర్తిశేషులై చన్నవారి శాఖాబ్రాహ్మణులే ... కాఁబట్టి రాజ్యతంత్రము కవితాసతియు వీరి యధీనమై యుండుటచేత వీరిని మఱచి యాంధ్రదేశ చరిత్రము వ్రాయుట సాధ్యముకాదు" అని చరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారు. ఇంకను వలయునేని "తెలుఁగు కవియన్నను దానభాస్కరుఁ డన్నను దేశమెల్లయెడల నిప్పటికే నియోగి యనవలసియుండగా నీ యారామద్రావిడ చాటు

పద్యము (వేటూరి ప్రభాకరశాస్త్రిగా రెంతయో కష్టపడి సంపాదించు "చందనశాఖికన్న" అనునది) నియోగులకు హాసి కరమని యీ వాక్యములు వ్రాయలేదు. పత్యేతరము వచించుట కాదంటిని" అని యాంధ్రవాఙ్మయ చరిత్రకారుడు. కావున నా పద్యములఁ బ్రకటించుట నా కావంతయు నిష్టము లేదని మఱల జెప్పుదును. కవితా రసజ్ఞుల కన్నావిఁ బఱించు కోరిక యింకనుబాయదేని యొక్కమాటఁ జెప్పుచున్నాను. వినుఁడు! నాకు కర్త, కర్మ, క్రియలుకూడ తెలియవు. నాల్గు సంస్కృత పదంబులున్న యొక పద్యమున కేనియు నర్థముచెప్ప లేను. ఇట్టితఱి :—

"పందెమొడ్డి వచింతు సభాంబు బగుల
నాంధ్రభారతి మాయింటి యాఁడుబిడ్డ"

అని చెప్పి

"చచ్చిపోయిన మావారు చావనిమ్ము
బ్రతికెదనుగాక నేను నా బలముజూప."

నని తమను ధిక్కరించుచు వ్రాసిన పద్యములకుఁగూడ వారు—బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగా 'రదిరా! కపిల్ప' మన్నట్లు ప్రశంసించుటనే సంతృప్తిజెందుదు. ఈ విశాలాంధ్రోర్వి జెప్పికొనఁదగిన పండితశ్రేష్ఠు లనేకులు కవిత్వమునం దనామకులుగా నుండుటయు, నాబోటివాని కవిత్వ మాంధ్రమున మేము కవీంద్రులమని పెద్దగాఁ జెప్పికొనువారి తలనుగూడ నూపించుట నాకు నేనే మురిసిపోయెదను. నాయదృష్ట మనన్య సామాన్యముగదా!

ఇంక నాపద్యములకు వారు సమాధానముగా వ్రాసియు 'కులతత్త్వము'ల వ్యాసమును గూర్చి చెప్పెదను. కేవల మట్లు నాచేసికొనిన యత్నమున నే నేను మా పూర్వ మంత్రికవుల పేరెత్తి వారలం దూలనాడితినే కాని నా కే కులముపైనను ద్వేషము లేదు. ఎట్లు నేను విధిలేక పూర్వమంత్రికవుల దెచ్చి యెట్లు ఇతరకవుల నీసడించితినో అట్లే వీరును నాకుగాంచి 'కులతత్త్వము' లను నేరము మోపి నన్ను పరిహసించుటకు వీలుచేసి కొందురు. అంతియతప్ప నిందు జెప్పందగిన దింక నేమియును లేదు. వైదికులలో నా యభిమానించు కవు లనేకులు కలరు. వలయుచో నెందఱ పేరులైన నుదహరింతును. దానవచ్చెడి లాభ మేమి? నాతో నే కొలంది పరిచయ మున్నవారైనను సరియే. నా కొక కులముపై ద్వేషమున్నట్లు చెప్పంగలుగుదురా? ఇంతకు జాషువకవికి నాకెట్టి సంబంధము? ఉన్నకవుల నెల్లర కాదని యతనికే నాకృతి నేల యంకితమివ్వ? ఇంకనవ్వారు నన్నుం గూర్చి వ్రాసియు కులతత్త్వ వ్యాసమునకేమి విలువ? ఇట్లుగా భావించి నేనా వ్యాసము నన్నుగుఱించి కాదనియే యనుకొనెదను. సహృదయులు కూడ నీవిషయ మిట్లుగానే భావింపనొప్పు. అందు నేమేని నిందోక్తులే యుండుగాక! అందునకెవ్వరికిని వృథా వాదములు పెంచుట కూడదు. నాకు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి మీంద భక్తియే కలదు. వారు నాకు గురుతుల్యులు. ఇందునకు

“జ్ఞానవిహీనులై తమ మతంబులఁ బేరుగడింపుకోర్కెలం
బూని, యహర్నిశంబు దన పాత్రములందున తప్పులెన్ను మ

ర్మానుల యున్న గౌరవము మాయఁగఁజేసెడు "చెళ్లపిళ్లపం
చానను" వృద్ధదేశికుని సంతసమొప్ప నుతింతుఁబోఁదటన్."

అను పద్యమే ప్రామాణ్యము. ఇయ్యది వారిని దూషిం
చుటకు ముందటనే వ్రాసినాఁడను. ఈవిషయము వారికిని దెలి
సియే యున్నది. ఇందునకు కులతత్త్వముల వ్యాసమున వారు
దీని నుదహరించినారనుటఁ దెలియవచ్చు. ఇట్లనే వారికి నాయెడ
వాత్సల్యము కలదు. ఇందునకు నేను వారిని ధిక్కరించుచు
వ్రాసిన పద్యములకుఁగూడ వారు నన్ను ప్రశంసించుటయే
తార్కాణము.

ఎవఁడు చెళపిళ్ళ సింహంబు సేసడించి
బ్రతికిపోఁడంటపో; యింతవఱకు నేఁ డ
నతని నెదిరించి నేఁ మెప్పందికంట
అదిర! నాభాగ్యమింక నే మనఁగవచ్చు?

వెనుక నభినవదండి తిక్కనను జెప్పి
తనకవిత్వంబుపట్ల మోదంబుఁగొనియె
నిపుడు నెల్లుట్ల; కవుల కన్నెల్లఁగాగ
ఘనతనందెడిఁ జెళ్ళపిళ్ళను వచించి.

తనను భూషించువాని కై తను గుఱించి
యెంతబొగడిన తిక్కన్న నేమిచెప్ప?
తనను దూషించు నా కై తగుణమునెంచు
వానిఁ జెళపిళ్లనే మెచ్చవలెను గాక!

నెల్లుట్ల

# లేఖ



మిత్రవరా ! రామకృష్ణామాత్యా !

అట్లు మిత్రులమధ్య మనకు జరిగిన ప్రసంగము సంబంధము చక్కగా గ్రంథస్థ మొనరించుటయేగాక నా యాశించినవిషయంబు లన్నింటిని నెంతయు సంతృప్తి కరంబుగ సమన్వయించినాఁడవు. కేవలము నామాటల నింతటికథ — అందును జరిగినవానిఁ బోలెనే యల్లుట నీ కెట్లు సాధ్యమైనదో కాని నాకేమియుఁ దెలియవోవుట లేదు.

"....కథయుఁ బ్రకృతియందలి వస్తువులవలెఁ దనంతఁ దనయందలి సత్త్వముంబట్టి పుట్టిపెరుగు గుణముగలది. దానిని సాజముగఁ బెరుఁగనిచ్చి యప్పుడప్పుడు సవరించుచు, సంస్కరించుచు, దోహదము చేయుచు వచ్చినమేలా ? మొదటినుండియే యాయారసములు తప్పక యీఁగలదానిని గల్పించెదనని సంకల్పించుకొని పిమ్మట దానియుత్పత్తిఁ జేయఁజూచుటమేలా?" అని 'కళాపూర్ణోదయము' నకుఁ బీఠిక వ్రాయుచు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రశ్నించినారు. అట్టితటి నీ యీవిషయంబులఁ గావ్యమల్లుమని నాసూచించిన యాయాయభిప్రాయంబుల నింతగాఁ జొప్పించి నన్నుఁ జకితునిఁ జేయు నీభావనాశక్తి కడుంగడుఁ బ్రశంసనీయము.

నీ కావ్య గుణాగుణముల విమర్శించి వాఙ్మయమున దానికిఁ గల స్థానము నిరూపించుట సమర్థులగు విమర్శకులవలననే తప్ప యది నావలనఁ గాదు. అయిన నాంధ్రవాఙ్మయ సంతతిలోను నీ హస్తంబుల 'గీత' పద్యము సొంపులు దీరినదని చెప్పుదును. కావ్య పఠనానంతరమున నీకవిత్వమునకు నాకథయే కొంత కళంక మాపా దించునట్లు పొడగట్టినది. ఆ దోషములు నావియకాని నీవి కావు.

'హిందీ' యక్షరములు పోయినవెనుకఁ గథానాయకుని గూర్చి చెప్పుపట్టుల—

"అయ్యయో! నేను నామన సరయకుండి
యెవరిమాటనొ యీపూన్కి కేల బూంటితి"

అని యప్పటి నీమనోబాధ వెల్లడించి,

"హృదయమా! యెట్లనేని సహించియుండు"

అని నీకు నీవ యుపశమించి మీఁదటికథ నారంభించితివి. నామిత్రుని మనం బింతటికో మలమైనదని యెఱుంగక యంతటి ఘోరదృశ్యం బుల నెంతయుఁ గాఱించిన నన్ను భగవంతుఁడు మన్నించుఁగాక!

విక్రమ భాద్రపదము
ఏకశిలానగరము

ఇట్లు
ప్రమోదకుమారుఁడు.



# వ్యాఖ్యలు — విమర్శలు



"ఈ కావ్యము సాంఘికమునకు సంబంధించినది. దీని ప్రేరకుఁడు ప్రమోదకుమారుఁడు. ఇతఁ డమాత్యునకు నెచ్చెలి యట. ఇతని మాటలనే యీకావ్యమునం దనేకవిషయములు జొప్పింపఁబడినవి. 'సూరబాలా రామకృష్ణు'లను కథానాయికానాయకుల నామములఁగూడ నాతఁడే నిర్ధారించినాఁడు. 'రామకృష్ణుని నటకునిగాఁ గవినిగాఁ జేయుట యమాత్యుని ప్రతిభావిశేషము. హిందీయక్షరములఁ గూర్చియున్న ప్రసక్తి కథయందంతగా రక్తిగట్టించుట వర్ణనాతీతము.

ఇక్కథ యెట్లు లభ్యమైనను కాళిదాసుఁడు యక్షుని మించి, తిక్కన సంజయుని మించి, పోతన ప్రహ్లాదుని మించి, సూరన శాలీలుని మించి, యమాత్యుఁడు రామకృష్ణునిలోఁ బ్రతిబింబించినాఁడు. ఇట్టికథ లమాత్యున కెంతటి బాధాకరములో

"ప్రేమయందలి సౌఖ్య మదేమొ కాని
నాకు వేల దద్ది యెన్ని జన్మాలకయిన"

అను వాక్యములఁ దెలియఁదగు."

* * * *

"కావ్యాదియందుఁ 'బ్రమోదకుమారుఁ' డమాత్యుల వారి 'శకుంతల' 'హరిమాయ' రూపకంబులును, మఱియు 'సహజపాండిత్యుఁడు'ను 'సూరబాల'కు మున్నే వెలువడినట్లు చెప్పుట కలదు. విచారింప నీగ్రంథము లింక నముద్రితములు.

అయిన నాతఁ డట్లు వచించుటఁ జూడ వానితరువాతనే 'సూరబాల'ను బ్రకటించుట నిశ్చయమైయుండును. లేదా రచించు క్రమమునే కొని యిట్లు చెప్పవచ్చును. కావున 'సూరబాల'కు ముందటనే యీగ్రంథము లచ్చొత్తింపఁబడి తీరవలె ననుట సమంజసము కాదు."

* * * *

"ఈకృతికన్య నెవ రెట్లు విమర్శించినను 'తెలుఁగు కవిత్వము మాదే' యని విశ్వవిశ్వంభరమునఁ బండె మొడిన మంత్రికులాగ్రిణికలమున నోములపంటగాఁ బుట్టినది. ఆంధ్రవాఙ్మయమున నేకృతికన్య లెఱుంగని మహాగౌరవముతో నొకయింటిదయినది. ఎంతేసియు ధన్యాత్మ."

* * * *

"'భవభూతిఁ' బోలు మహాకవులు 'నేఁడు గాకున్న మాకృతుల నేనాఁటికేని యొక్కఁ డాదరింపకపోవునా ?' అను భావం బుండి యంతటనే సంతృప్తి నందినారు. తనకవిత్వమును గూర్చి కవికి వలసిన దంతమాత్రమయేని 'ప్రద్యోదకుమారుఁ' డట్లు ప్రశంసించుటయేగాక 'కందము'నకుఁ దిక్కన 'సీసము'నకు శ్రీనాథుఁ డన్న 'ట్లాంధ్రవాఙ్మయ మంతటిలో 'గీత' పద్యము సీహ స్తంబుల సొంపులు దీరిన' దనుట నమాత్యుఁడు తన కన్నులనే చదివికొనినాఁడు. మఱియు సమకాలికు లగునితరకవీశ్వరు లెందఱో తల లూఁచినారు. అందు—"మీరచనమునందలి ప్రతి పదము నందును 'కాటుకకంటినీరు' 'బాలరసాలసాల' మున్నగుపద్యముల రచించినకవివతంసుని మానసోన్నతిని, ధన్యాత్మక

దృష్టిని వేనోళ్లఁ జాటుచున్నది" అని 'ఆంధ్రతేజము' రచించిన బోడేపూడి వేంకటరావుగారెన్నఁడో చెప్పినారు. ఈకృతికన్య నంతటి జాషువకవివరేణ్యుఁ డెల్లు వలచి పత్నిగా స్వీకరించినది జగత్ప్రసిద్ధము. ఇంతకన్న నమాత్యుల కింకేమి కావలయు?

* * * *

"కౌండిన్యగోత్ర మొకపోతనతోడనే యున్న ట్లమాత్యులు దాని కెంతయుఁ బ్రాధాన్య మిచ్చినారు. అందు వారిభావ మాపోతనార్యుని సంభవముననే కౌండిన్యగోత్రము పవిత్రమయినదని. ఇదియునుంగాక నాతనియెడ వీరికిఁగల యభిమానము వర్ణనాతీతము. "Among the ancients, the author (Amatya) regards Potana as supreme" అని శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారును సాక్ష్యమిచ్చినారు. ఇ ట్లెవ్వరేల చెప్ప? ఇందలియవతారికయందు నమాత్యులు పోతనామాత్యుని బ్రత్యేకముగ వచించుపట్లు:-

"అతఁడు పోతన నామది నావహింపఁ
గంత మెత్తుచునున్నాఁడఁ గాలిపోదు;
కాలిపో దాంధ్రమందలి కవులశక్తి"

అనుచు మూర్ఛిల్లిపోవుటఁ జూచినవారి కెవ్వరి కాశ్చర్యము గలిగింపదు? అంతటివాని గోత్రంబున నుదయించుటయే వారికి గర్వకారణము. దాననే నేను పోతనగోత్రజుఁడ నని ఘనముగాఁ జెప్పుకొనినారు. లోకమున నాకౌండిన్యు లనేకు లున్నారుకాని యమాత్యునిబోలువాఁ డొక్కఁడునులేడు, ముమ్మాటికిని లేడు. కేవల మొకగోత్రసామ్యమును బట్టియే—

"చూడ పోతన కే గోత్రజుండ నగుటఁ
దెలిసియేయుందు నీదుహృద్వీథియందు
నందుచే నాకృతియును నరాంకితంబు
సేయనే సేయనంచు వచింతు; వింటె!"

అనెడి యమాత్యులు పోతనగోత్రజులా? నిక్కంపువంశజులా? ఏదియు నిర్ణయింపరాకున్నది. పోతన కేము వంశజులమనియే నోరారఁ జెప్పి, పాడుధనాశ నాతని దలవంపులపాలు గావించువారలకన్న, 'నేను పోతన కేకగోత్రజుఁడ'నని యాతని శీలమును గాపాడెడి యమాత్యులే పోతనకు వంశజులు. వారలే యాతనికిఁ బూజ్యులు. పోతన కేము వంశజులమని నిర్భయముగా నన్నుత మాడువారల విషయము, నింక నాతనిగూర్చియున్న యనేకరహస్యములు "సహజ పాండిత్యుఁడు" గ్రంథముఖమున సాంగోపాంగముగా నెఱుంగనగు. ఆ రచన్నముచం దమాత్యులు రక్తమొడిపి, యుండిన వితండావాదంబుల నన్నింటి ఖండించుచు, ముఖ్యముగాఁ దముచెప్పినదే వేదవాక్యమని మఱియు నహంకరించి, యేమేమో యాడిన శ్రీ శేషాద్రి రమణకవుల ద్వీపాంతరమువఱకు వెన్నాడి యాంధ్రవాఙ్మయమునఁ బోతనార్యునితోఁ దమనామమును స్వర్ణాక్షరముల వ్రాయించికొన్నారు. ప్రస్తుతము పోతనామాత్యున కొక బిడ్డతప్ప మగసంతానమేమియు లేదనియు, నాతనియగ్రజుఁడగు తిప్పరాజునకు సంబంధించినవా 'రుత్తమరాజు' వా రనియుఁ జెప్పంబడు."

ఇట్లు
" స హ వా సి "

—❖—

# సూ ర బా ల



కావ్య మొకటి నేను గల్పింపఁగా నెంచి
నాయనుంగులచెవి వేయుటయును
మోదమంది తా 'ప్రమోదకుమారుండు'
మోహానముగ నాదుమోముఁ జూచి.

"వెలయించితివి 'శకుంతల, హరిమాయ'ల
  రూపకంబులను గ్రొంగ్రొత్తరుచులఁ
గావించితివి 'ఖండకావ్యంబు'లను గొన్ని
  భావనాసంపద భాసిలంగ
రచియించితివి 'బహిరంగలేఖ' నొకండు
  తెలుఁగుపత్రిక లెల్లఁ దెల్లఁబోవఁ
ప్రకటించితి 'సహజపాండిత్యుఁడు' విమర్శ
  కులకన్న లోకులఁ గోరగింప

నయిన నింకను దమిదీఱ దనఁగఁ జెప్ప
ని ట్లిపుడు కావ్యము రచింపనెంచి తీవు
తావకీన లసత్కవితాపిపాస
కెంతకన్నను దృష్టాంత మేమి? సఖుఁడ!"

అని యింక నేమో ప్రశంసింపనెంచునాతని వారించి, "నెచ్చెలీ! నాపూన్కి మెచ్చి నా కిం దుత్సాహం బొసంగుట

ప్రస్తుతంబగుఁ గాని నాకవితాపిపాస కేమి? ఈకవిత్వంబు నీ వెన్నఁడు నేర్చితి? చాలును. నీసంస్తవంబుఁ జాలింపు మయ్యది యియ్యెడ నప్రశస్తం, బవసరంబగునాఁట దానిని సూటిగా నాకు నేన చెప్పి కొందు నందు నుంతయు నేను భయం బందను. కాకులగు లోకుల గణించువారు కవివరేణ్యులుకా" రని కావ్యంబునకు నాపన్నిన కొన్నికథలం జెప్పి "యిందు నెయ్యది చొప్పింప నో" వ్వని యడుగుడు నాతం డేయొక్క. దాని కొక్కింతయు సమ్మతింపకున్న "పోని మ్మేదేని నీవేని యొఱింగింపు" మనవుడు "మిత్రవరా! నేఁ డేగ్రంథంబునఁ జూచినను విరహవేదనమే కాని వేఱొండు గానంబడదు. నీవు నామార్గంబుననే నిర్గమించిన లాభంబు లేదు. పవిత్రంబుల సోదరీ సోదరప్రేమ మగ్రగణ్యము. లోకంబున నెంతటి విషయవాంఛా సక్తులైన నున్నారు. బాల్యంబున నస్నేహలు పాపంబుల బోవుట ప్రకృతిసిద్ధంబ కాని వివాహితు లయ్యు నెందఱో పూర్వాం కితుల వీడనొల్లరు. చెప్పరానిపాపంబులం జేయుచుఁ గొందఱు పాపరహితంబులగు వావులకుంగూడ పాప మాపాదించు చున్నారు. పరాంగనల బలాత్కరించు కామాంధులసంఖ్య యేనాఁ డును బహుళంబేను. వారలలోఁ గొందఱకు హీనగాథ లుపకర ణంబులు. పతులు పెక్కండ్రు మరభిప్రాయంబునఁ దమపత్నుల నెంతేనియు ద్వేషింతురు. ప్రేమయనఁ గేవలము శరీరసుఖసంబం ధమైనది మాత్రమే యని మఱికొంద అందురు. వీరికేదోడు 'వారువీరును' నపవాదంబుల మోపుదురు. తత్సంబంధితు లనేకు

లనేకవిపరీతచర్యలకుఁ బూనుదురు. తమకు గిట్టనివారలసంతోషంబునకుఁ గనుఁగుట్టి దురాత్ములు వారలకు దుఃఖంబులఁ గూర్తురు. వేరూరులేనియుత్తరంబుల "కితండే మనకుఁ బగతుం" డనియనుమానించి యంచితులైనవారల నిందించుట నా కాంచినయర్థంబు. మఱియు నింటిపెద్దల లోభత్వమునం జేసి యువకులైనవారే మెందఱో దుర్మార్గు లగుచున్నారు. అవ్వారిచేతలఁ కాపెద్దలు తిరిగి యితరుల నాడిపోతురు. స్వహస్తలిఖితంబుల బాడుధనాశ నసత్యమార్గమహీనాత్ముల కెక్కడను లెక్కలేదు. ఊరక పండితాళిని నెగ్గాడు పప్పునరసయ్యలు మిక్కిలి శిక్కటెలినారు. అపకారంబుల కుపకారంబు లటుండ నుపకారంబుల కపకారంబులే ప్రబలినవి. కొంద ఱాంధ్రు లింకను హిందీభాష నాదరించుటలేదు. తమజీవితంబుల ధర్మంబునకు ధారవోయ వలసినకవులు నటకు లనేకులు హీనపంబులకే యభిముఖు లయ్యెద" రను నిట్లుండు నుపన్యాసంబు నా కెంతయు విస్మయంబు గలిగించుడు నింక నేమో సెప్పఁబోవునాతని సెగాదిగఁ జూచి "వయస్యా! నిన్ను నేఁ డేమయిన మాయ యావహింపదు కదా? మఱియు నే! ఏదేని కావ్యమునకుఁ దగినకథ నెఱింగింపు మన నిట్లు లోకుల నేకరువుపెట్టు దండును నీచెప్పినది యొక దాని కొకటి యన్వయింప దిది యే" మనుడు నాసఖుడు "నాయాడినవిషయంబులనే భవదీయప్రజ్ఞావిశేషంబున నొక విషాదగాథగా సమన్వయించుచుఁ గావ్యంబు గావింపవలయు. వెండియును వింటే! కొంద ఱవివేకులు 'గీతంబుల' నొప్పింపఁ

జాలక వానియందుఁ గవిత్వముండదన్నట్లు 'గీతంబుల' వ్రాయువారు కవులా? అనుచున్నా రట్టివా రంద ఱేకమీఁదఁ దల వంచికొనురీతి నీవు సాధ్యమయినంతవఱకు నీకావ్యంబునం దా గీతంబులనే చెప్పి మెప్పొందు మిది నీకు నాయాన సుమీ? మఱియు సూరబాలపేరు నా కెంతయు నచ్చియున్నది. కథానాయకునిగూడ 'రామకృష్ణు' డనువానినే సృష్టింపు; మీ నీ మిత్రకోటి కంతటికి నది యెంతేనియుఁ గూర్చునది. కదా?" యనుడు నందులకుఁ దక్కినవార లందఱు నేకగ్రీవంబుగ నామోదించు డేనును సీతాన్వేషణనిమిత్తంబున సముద్రంబును లంఘింపఁబూను హనుమంతునిఁబోలెఁ బొంగిపోయి యప్పుడేమియు నాలోచింపక "మీయభిప్రాయంబుల నన్నింటిని సమన్వయించుటయే కాదు. మీరు పేర్కొన్న మదీయప్రతిభా విశేషంబున నొకమీకేగాక తోడికవికులమ్మంతయు 'నహో' యనఁ బూర్వోత్తరంబులను రెండుభాగంబుల నిక్కథకుఁ బ్రాణంబులఁ బోయువాఁడ" నని యప్పటికి వారల వీడ్కొని మదీయాంతరంగంబున—

ఏను మిత్రాజ్ఞను సమన్వయించుగాథ
పుడమి నెందఱ కన్వయించెడినొ కాని
అకట! 'మముగూర్చి' యనియె వా రలిగి నాపు
శిరము నింపరె? నిప్పదోసిళులఁ బూని.

ఏమి నా వెఱ్ఱి? యీయంత నెఱుఁగలేక
దీనగతిఁ బోయి యేమొ చింతింతు నేమి?

సంఘసంస్కర్తలకు నిట్టి సంఘటనము
తలఁప నెందును బ్రకృతిసిద్ధంబ కాదొ!

అని తర్కించినమీఁదట
మనమునఁ గల భీతియంత మాయం బయి పో
వెనుకటివ్రాల్మ్ల న్నిడుకొని
యనువుగ మద్వంశ మింక నభివర్ణింతున్.

కావ్యముఁ గనంగఁ జిన్నదే కాని యిందు
వంశవర్ణనమా? యనఁ బాడి కాదు;
కలము 'కసరత్తు' లొనరించి కాకదీఱ
నెవరిపరిహాసములకు నా కేమి లెక్క?

ఎవ్వారికలముల నింపుసొంపునఁజేసి
తలయెత్తఁగలిగెను దెల్గుఁగవిత
యెవ్వారిమంత్రిత్వ మెంచి యా శాఖ నా
మాంకితం బయ్యె 'నమాత్య' శబ్ద
మెవ్వారికీర్తి సహింప కందందునఁ
బడుగు రేకంబుగ వదరుచుందు
రెవ్వారిధర్మసమీక్షణంబుఁ దలంప
గర్వాంధులకయిన కత్తిదెబ్బ
యుర్వి నా యూరువేలనియోగులందు
నెల్ల విబుధాళికిని బూజనీయుఁ డగుచుఁ
దనరు పోతన సుకవి గోత్రంబుఁ జెప్ప
భారతి యొసంగు మోదబాష్పములఁగాన్క.

అట్టి కౌండిన్యగోత్రమం దవతరించి
ప్రజ్ఞ మెఱయంగ నారపరాజమంత్రి
కృష్ణరాయలభాండార మేలినాఁడు
'రాజభండారి' యింటిపేరయి వెలుంగ.

కవివతంసులపాలిటికల్పవృక్ష
మనఁగఁ బేరొందు కృష్ణరాయక్షితీశుఁ
"డిట్టివాఁ" డంచుఁ గ్రొత్తగ నేమొ చెప్పి
వేఱ వర్ణింపవలెనె య వ్విభుని నేను?

ఆ నారపరాజీ వి
ద్యానగరేశుండు స్వర్గ మరుగుట, రాజ్య
క్షీణం బగుటం జేసియుఁ
దా 'నైజాము'నకు వచ్చుదారిఁ దలఁచెన్.

అట్లు విచ్చేసి ప్రప్రథ 'మర్వాపల్లి'
సీమయందలి దగు 'బాలవేముల' యను
గ్రామమందున నిలచి భారతిని బొగడి
యామెయభయంబు రక్షగా నందె నతఁడు.

అంది యటుమీఁదటను ననేకాంధ్రకవుల
నీతిఁగను నాఁటితురకమన్నిని జేరి
తనమహిమ నాతనికిఁ 'గార్యదర్శి' యయ్యె
గాలమా! నేఁడు వచ్చి 'ఖూనీ' లి వేమి?

నారపామాత్యుఁ డా జననాథు నట్లు
చేరి యొకప్రాంతపనియందు భారతిదయ

'గోట్లుపర్తి' 'వేలుపు, నిడుగొండ'లనెడి
మూఁడుసీమలఁ బడసెఁ బ్రమోద మెసఁగ.

అతనితనయుండు రామరా జనెడు నతఁడు
పిదప 'నెల్లుట్ల' గ్రామప్రవేశ మందె
నాఁటితోడుత రాజభండారు పోయి
వెలయు 'నెల్లుట్ల'యే యింటిపేరు గాఁగ.

ఈ రామరాజునకుఁ 'బెద - చిన నారప రాజులు, మల్లప రా' జను ముగ్గురు పుత్రులు కలిగిరి. అందుఁ బెద నారపరాజ సచివునకు, 'రామరాజు, కంకటయ్య, సింగరాజు, రామయ్య' అను నలువురు తనయులును, 'చిట్టెమ్మ, మల్లిక, చింతామణి' అను మువ్వు రాఁడుబిడ్డలు నుద్భవిల్లిరి. జ్యేష్ఠుం డగు రామరాజునకు, 'బొజ్జకేశవులు' 'పంచయ' 'లక్క-రాజు' 'నారాయణ' అను నలుగురు సుతులు జనించిరి. అందు నారాయణాఖ్యునకు, 'కేశవగిల్లప్పము' 'దంటపీడు' 'రామానుజులు' 'వేంకటయ' అను నలువురు కొడుకులు పుట్టిరి. కేశవగిల్లప్పమునకు 'వేంకటాద్రి' 'నారసింహుఁడు' అను నిద్దఱు పుత్రు లుదయించిరి. అందు నారసింహుని 'కచ్చన' కొమరుం డయ్యె, నా యచ్చనకు 'దమ్మన్న' 'వేంకన్న' అను నిద్దఱు సుతులు వెలసిరి. అందు దమ్మనకు 'అచ్చన' 'లక్ష్మన్న' లను పుత్రద్వయం బుత్పన్నం బయ్యె. లక్ష్మన్నకు 'వేంకటజోగు' 'వేంకటరాముఁ'డను నిరువురు తనూజు లుదయించిరి. అందు వేంకటజోగునకు 'రాయలు' సంభవించె, నాతనికి 'వేంకటనరసయ్య' 'జగన్నాయకు' లను

నిద్దఱు కుమారు లుద్భవిల్లిరి. అందు వేంకటనరసయ్యకు 'కొండల
రాయఁడు' పుట్టె, నాతనికి 'రామానుజరాయఁడు' భాసిల్లె,
నా రామానుజరాయునకు నరసింహరాయఁడు దౌహిత్రుఁడయ్యె,
నాతనికి 'వేంకటేశ్వ' రాభిధానుఁడు పుత్రుఁడుగా నుదయించి—

'గోదాన' 'గృహదాన' 'భూదాన'ములఁ జేసి
వైష్ణవాళిని దృప్తిఁ బఱచినాఁడు
తమిదీఱ 'రంగనాథాలయంబు' నొకండు
'కూనూరు'లో నెలకొల్పినాఁడు
పెండ్లికై యాచించు పేదవటుల నెల్ల
యింటివారలఁ జేసి యెసఁగినాఁడు
ఇట్లుగాఁ బనిఁబూని యెన్నింటి వచియింప ?
పుణ్యంబె తానుగాఁ బుట్టినాఁడు
ఇంత మాత్రఁడె తన బాల్యమంత నయయొ !
'ఉండి యొకనాఁడు లేక పస్తుండె' ననఁగ
'లచ్చి' యనుదాని నింక నా యిచ్చదీఱఁ
దన్నె దనుగాత! వామపాదమున నేను.

తన, కొనుకీర్తి సంపదకుఁ
దద్దయు నీర్ష్య వహించి యేమొ యెం
చిన యరివర్గమంతటిని
నేఁటికి నప్పుల ముంచి తేల్చె 'యా
ధునిక భగీరథుం' డన య
థోచిత రీతినిఁ గప్ప మందు మా

జనకుని జెప్ప శేషుండును
        జాలం డనంగవు లెంతవారికన్.
ఈ నయకోవిదుండు తన
        యేలుబడింగాను సచ్చరిత్ర; ల
క్ష్మీనరసాంబయుం దనుప
        మేయగుణాఢ్య మహావదాన్య; ల
క్ష్మీనరసింహారావు నటు
        మీంద వచింపంగ మోహినమ్మ నా
సూననుగాంచి యంతటనె
        చువ్వెదొరంగెను ధర్మగేహినిన్.

ఆతం డమ్మాయి నా నర్సమాంబబాసి
వసుధం దనకింక నామోహబంధ ముంట
మగుడ నుద్వాహమాడె రామానుజాంబ
నామె సత్కీర్తి నెవండు వ్రాయంగదగదు ?

కుష్ఠురోగార్తుండై కుములు కౌశికుం బత్ని
        సుమతియేయనం దాను జూడనొప్పు
నతిథుత్రై యెవ్వార లరుదెంచి ననువారిం
        గన్నతల్లులమించి గాచుచుండు
సూరివారలనెల్ల నూహించి వారి దు
        పదలందుం దాం బాలుపంచుకొనును
బంధుకోటిని బేదవారెందఱున్నను
        పెట్టుపోతలం జాల వెలితిమాన్పు

నామసామ్యంబుఁ జేసియో యేమొ తెలియఁ
దనను గను వారలొరున కీ దలఁచు వేళఁ
గృష్ణునకుఁబోలె నీనాకె గృహిణియయ్యె
మేలు! నా యింతి యిల్లాండ్ర మేలుబంతి.

పుణ్యమునఁబోని మఱి పాపముననె పోని
యే యవస్థయు రాని యే చేనిగాని
యీ కవీంద్రుని తోడిదే లోకమనుచు
నూలుకొనియుండు నెపుడు నా లోలనయన.

* * *

నాకుఁ గలఁ డొక్క శిష్యుఁడు లేక లేక
నడుగుచో వాఁడు దన ప్రాణమైన నిచ్చు
నింతకును నేను 'వత్సా! వసంత!' యనుచుఁ
బిలిచెదను వాని కయ్యదే పేరుగాగ.

వాఁడు నాముందు జచ్చిపోవలెనె కాని
వానిముందట నే జత్తునేని యకట!
నాకుగా శ్మశానమున నేకాకి యగుచు
నెంత విలపించునో యంచు నేడ్తు నేను.

ప్రథమమందున నా పేర రావృపదము
దగిలి సూర్యునిజూచుచు నగుచునుండుఁ
గాని, కారణాంతరముల హీనమగుట
నేను దానిని భరియింప నేరనయితి.

అంత నాముందు కర్తవ్య మరయుచుండఁ
గవితయందును నే 'మొనగాఁడ' ననెడి
కవివరేణ్యుల సలహాల 'కవి' యటన్న
పదముఁ గొని యంత నాపీడ వదలుకొంటి.

ఇంక నెక్కడి కేగుదో యేమొకాని
మెప్పుఁగొను నాల్గుపద్యాలఁ జెప్పలేని
వారి కెందఱకో కవి పేరు కలదు
చూడ నిచ్చోట మఱియు నసూయకూడ.

మతినిఁ దలపోసి యింక 'నమాత్య' పదము
స్వీకరించెదఁ గాక నిశ్చింతతోడ
నుర్వి దీనిని మంత్రి నియోగితప్ప
నన్యుఁ డొక్కఁడుఁ గొనఁగ రాద నెడు నియతి.

ఇమ్ముగ నీ దినంబు సరి
యెక్కడ నేనియు నే నమాత్య శ
బ్దమ్మునఁ బ్రాజ్ఞు లందఱు 'సె
బా' సని సంస్తుతిఁజేయ, ధర్మ మా
ర్గమ్మును వమ్ముసేసెడి దు
రాత్ములఁ బట్టి నుదం బడంచి, మో
దమ్మున ముంచి తెల్చెద 'మ
దంబ' యటంచ చని యాంధ్రభారతిన్.

ఇట్లు కృతనిశ్చయుండనై యెసఁగుమీఁద
దేవులందఱియందు సాత్త్వికుఁ డనంగఁ

బరగి యే దేవుఁ డిచ్చుఁ గైవల్య పదవి
నట్టి దేవాదిదేవు నే నభినుతించి.

* నల్లని నాదుదేవుని మ
నంబు దలిర్పఁగఁ గూడియుండి, తా
నల్లనఁ గౌఁగిలించికొను
డాతఁడు తత్క్షణ మెఱ్ఱఁబాఱుటల్
ఉల్లముఁ బట్టఁజాలక 'న
హా' యని నాథుని బెద్దనవ్వుతోఁ
దెల్లఁగ మార్చి ముద్దుఁగొను
దేవిఁ దలంతు మదాత్మఁ బిమ్మటన్.

---

* సృష్టికిఁ బూర్వ మజాండ మంతయు నంధకార బంధుర మనుటకు నల్లనిశబ్ద మొప్పుచున్నది. ఆ నలుపులోఁ గలసి నిర్గుణ పరమాత్మయు నలుపయి యుండుట, సహజము. అట్టివానికి 'మాయ'(ప్రకృతి)'విష్ణు' (సర్వవ్యాపకుఁడు) అను నామవికారాదులఁ గలిగించికొను నాతఁ డెఱ్ఱఁబాఱినాఁడఁట. 'లక్ష్మి' యెఱ్ఱని దవుట నామె దేహరుచుల నాతఁ డట్లు మాఱుట, సహజము. ప్రకృతి పరమాత్మ లొక్కటియగుట 'సృష్టికర్త' (బ్రహ్మ) యెఱ్ఱనివాఁడుగా జన్మించినాఁడు. ఇందు విష్ణువే బ్రహ్మగా మాఱుట గ్రహింపనగు. తండ్రియే పుత్రాకారంబుఁ గైకొనుట ధర్మశాస్త్రము. ఇట్లు విష్ణువు తనకు వశీకృతుఁడయి బ్రహ్మగా సగుణమందుఁ దవిలియుండుటఁ బ్రకృతి నవ్వు కొన నాతఁడు తెల్లనివాఁ డయినాఁడఁట. అనఁగా బ్రహ్మ యంతట 'సర్వజ్ఞుఁ'డయి, కామము సహించి ఈశ్వరుఁడుగా మాఱినాఁడు. ఆతఁడు తెల్లనివాఁడు. దీనఁ 'దెల్లని' పద మెంతేనియు నర్థవంతము. అజ్ఞుల దృష్టి నొక సామాన్య మయినదిగా నుండి విమర్శకుని కలమున కింతగాఁ బనిఁ గల్పించిన యీ పద్యము మివులఁ బ్రశంసనీయము.

—చతుర్వేదుల నాగభోగీశ్వరశాస్త్రి.

తులముకై తనఁ బదివేలవిలువఁ జెప్పి
తరలిపోయిన పూర్వసత్కవుల నెంచి
తన మహావేశమును నాకు భాగవోయు
పోతనామాత్యుఁ బ్రత్యేకముగ వచింతు.

తనజీవితముఁ గష్టమునఁ దేల్చెనేకాని
ధనమును గలనైనఁ దలఁపలేదు
తననాల్క విష్ణుచింతన కొసంగెనెకాని
యవనీశులను గొనియాడలేదు
తనచేత భాగవతము భూమి కిడెఁగాని
సింగని కొక్కింత లొంగలేదు
తనమనంబున నిప్పులను నింపుకొనెఁగాని
ధరణిని గర్జించి తన్నలేదు

అట్టిఁడు పోతన నామది నావహింపఁ
గంఠ మెత్తుచునున్నాఁడఁ 'గాలిపోదు
కాలిపో దాంధ్రమందలి కవులశక్తి'
యనుచు మూర్ఛిల్లి మఱి తేఱికొనినమీఁద.

జగతి 'సంపన్మదుంబ' వంశమునఁ బుట్టి
కొన్నిపట్టులు పోతనకన్నఁ జాన
ఘనముగా వ్రాసి నన్ను వశ్యునిగఁ జేయు
సింగరాచార్యులను ప్రశంసించి వేడ్క.

ఎన్ని భవంబు లెత్తి యెవ రెంత మహాకవులైన *'నాశువున్
బన్నెడు చాకచక్యమున, బండసమస్యలఁగుండెఁ' బిండిగాఁ
'బన్నెడు నేర్పులోనఁ దమఘాటికిఁ జాలిన'వారు లే రనన్
మన్ననఁగాంచియుంచుబుధమాన్యులఁగొప్రపుజంటనెంచెదన్.

జ్ఞానవిహీనులై తమ మ
నంబులఁ జేరు గడింపుకోర్కెలం
బూని యహర్నిశంబుఁ దమ
పొత్తములంచుసఁ దప్పు లెన్ను దు
ర్మానుల యున్న గౌరవము
మాయఁగఁ జేసెడు 'చెళ్ళపిళ్ళ'వం
శానను వృద్ధదేశికుని
సంతస మొప్ప నుతింతు మీఁదటన్.

"ఈ కవి యెంతవాఁ డితని
కింతటి పోకడ లెట్టు లబ్బె! నే
డీకృతి నొప్ప నాకల మ
ద్యూరె! తలంపగఁరా" నటంచు నా
మాకవితావిశారదుని
మాన్యుని జాషువఁ జెప్పి, యిక నా
యీ కవితాకుమారి నిటు
లింతగఁ జేసినవాని మోమునన్.

---

* '  ' ఇందలిభాగము మిత్రులు తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి విరచితము.

వాఙ్మయశుభాస్యఁ గాచి యాబాలవాళి
లాలసంబుగ 'జడకుచ్చు'లను గుదిర్చి
క్రొత్త త్రినదకల నామము గుటకనేర్పు
ప్రోడ! కవిభూషణా! రాయప్రోలు! పరిణతి!

* * *

నాలుగేండ్ల నీదర్శనంబునందు
నాదురచనలఁ గొన్నింటి నాలకించి
యాంధ్రకవితా రహస్యాల నాదరమునఁ
దెల్పు నీ ఋణ మే నెట్లు దీర్చుకొందు?

* * *

నేడు నీబోల్కి నన్నె మన్నించి చెప్పఁ
దత్వబోధను గల మహత్త్వంబె యనఘ!
అంతవఱదాఁకఁ గవిత నా కరయ రాదు
లేశమును నిన్ను మఱచిపోలేను; నేను.

* * *

ఇందున నీయెడంద 'యిది
యే'మని వింత నటించు నేని మా
రందముం జిందునట్టి కవి
రాల్టగు, జంఘుప సాఖ్య మివ్వ నా

నందము నొందుఁ బొంగెడి మ
నంబున నేఁ డిదె! చేయుచున్న నా
వందన మందవయ్య! గురు
భావము నంది రసజ్ఞ శేఖరా"!

*　　*　　*

అని కృతజ్ఞత నెఱిఁగించుకొనినమీఁదఁ
కృతిని బతి లేక చెప్పుట లెంచి చూడఁ
బతిని గొనకుండు నాతి జీవితమె యఁచు
నాదు కృతి కింకఁ జూచెద నాథు నొకని.

*　　*　　*

అతఁడు గూడను నన్నిటియందుఁ జెప్ప
తగినవాఁడుగ నుండిన సొగసుగాని
పాడుదరిద్రాశ మూర్ఖులపాలు జేసి
యేల నాకృతి నేన నట్టెటుఁ ద్రోయు?

*　　*　　*

ఇంతయో యంతయో కట్న మిచ్చి తగిన
వరునితోఁ గన్యఁ గూర్పఁ భావ్యంబు కాని
వారి చెంతనె కొంత ద్రవ్యంబు లాగి
యూఁడుబిడ్డల నట్లేల యమ్ముకొనఁగ?

'ఏఁడు పాఱుఁడువాఁ డిట్టివాఁ' డటన్న
కులము లేవేనియున్న వ్యక్తులకె కాని
యొక్క రూపున నెల్లెడ నొప్పియుండు
కవితయందున నెన్నఁడుఁ గలుగ వవ్వి.

అందునను గంటె; ధర్మశాస్త్రాళి యొకట
నెట్టిపట్టులనో యేమొ యెంచునపుడు
'వాఁడెవో మాలఁ డైనను బ్రాహ్మణుఁ డన
నింకఁ గవితకుఁ గులముల నేల తడవ ?

ఏ కులంబునఁ బుట్టి యెసగినాఁ డననేల ?
భావింప నొక వింత బ్రాహ్మణుండు
ఏ పాటి త్యాగి యై యేపారె నన నేల ?
యున్న దానిన కొంత యొసగుచుండు
నే దొడ్డగౌరవం బెనసినాఁ డననేల ?
భూమీశ్వరులచేత మ్రొక్కలందు
నే రీతిఁ గవిత శృంగారించె నననేల ?
హా యమాత్యాళినె మఱువఁజేయు
నతఁడు సామాన్యుఁ డెట్లగు ? నట్టివాఁడు
నాదుకృతికన్య కొప్పిననాథుఁ డనుచు
నెంతయును బొంగిపోయి యే నింకమీఁద
జాషువ కవీశ్వరునకు సుస్వాగత మిడి.

ఎల్ల లోకంబు నొకట మోహింపఁజేయు
నంత సుందరమగు కల మ్మందియుండి

పద్యపద్యాన నమృతసంపదను గురియు
జాషువా సత్కవీ! నమస్కారశతము.

చూడఁ బోతన కే గోత్రజుండ నగుటఁ
దెలిసియోయుండు నీమ హృద్వీథియందు
నందుచే నాకృతియును నరాంకితంబు
సేయ నేచేయ నంచు వచింతు వింటె!

అయిన నొకమాట! 'గురుతుల్యు లయినవారు
మతినిఁ దలపోయ దైవసమాను'లనెడి
నీతి నిక్కమ్ము నీకుఁ బల్కఁగ నొనర్తు;
వేయి నూలుపదాలుల స్వీకరింపు.

ఇది యలంకారంబు లే మెఱుఁగదు కాని
చూచువారలను వశ్యులను జేయు
నిద్ది శృంగారంబు లేమి సేయదు కాని
తిలకించువారి ముగ్ధుల నొనర్చు
నిది చిత్రములజాడ నేమి జూడదు కాని
వీక్షించువారికి వింతఁ గొలుపు,
నిద్ది శ్లేషోక్తుల నేమి బల్కదు కాని
వినువారి వీనుల విందు సలుపు
నిద్ది యొక వింతపడుచు, వేయేల చెప్ప?
యెట్టిదయినను పోతన నెంచి నీవు
గారవింపు మటంచు నే ధారపోయు
దక్కవీశ్వరుఁ డెంతయు హర్షమంది.

"ఘనతన్ జెందు 'జమీనుదారుల' కలం
కారంబవై, పోతనా
ర్యుని గోత్రంబునఁ బుట్టి సత్కవివరే
ణ్యుల్ మెచ్చ నీ కబ్బపుం
దనయ న్నాఁ కడి సత్కరించితివి; క
ట్నం బిచ్చి, రాజన్యమం
డన! నెల్లూరికవీశ! నీకతన ధ
న్యం బయ్యె నా కైతయున్.

నిక్కపు రాచఠీవి గల
నీకవనంబు తెలుంగు శోభలన్
గ్రక్కుచు; ధర్మమార్గమునఁ
గా లిడి సత్యము నుగ్గడించు, భూ
భుక్కవి! విద్వదాదరణఁ
బొంది రచింపుము కావ్యరాజముల్
పెక్కులు; పొట్టనింపుల క
విప్రకరంబు శిరంబు వంపగన్.

నీ కవితాసురద్రుమపున
నిక్కిన యీ కృతిపుష్పరాజము
న్నాఁ కడి గౌరవించితి ఘ
నంబుగ, నీ గురుభక్తి కీడు లే
దో కమనీయ సద్గుణ ఘ
హోదధి! పొంగిన నామనస్సులో

నీ కభిషేక మిచ్చితివి
నిర్మల సమ్మద గాంగనిర్ఝరిన్.
కృతు లిచ్చు కవిని నే నొక
కృతిపతినై నిలచి యమలకీర్తిఁ గొనుట ప్రా
కృతపుణ్య మేమొ! యిది నీ
కతాన నా కమరె, వింతఘటనంబె కదా!
'ఇది కలవారిపిల్ల ! హృద
యేశునిమాటఁ దిరస్కరింపదో!
మెదిపెచదో!' యటంచు చహింత
మెంచు విరోధుల కబ్బురంబుగన్
బెదవిఁ గదల్చి; వాక్సుధలు
నించి; సమంచిత గౌరవోన్నతిన్
బొదలెదుఁ గాత ! నీయనుఁగుఁ
బుత్రికవాఙ్మయ పుష్పవాటికన్.
నీ 'సూరబాల' మనసా
వాసంబు ననూనమైన బాంధుత్వముగాఁ
జేసినదిసుమ్మ ! చిత్రం
బీ సంబంధంబు; రామకృష్ణామాత్యా !
కరుణ గట్టినది నిక్కంబైన సుకవితా
పక్షపాతంబు నీ స్వాంతమందు
నటియించు నీ దివ్యనయనాంచలములందు
జం కెఱుంగని సమత్వాంకురంబు

ఆవిర్భవించె నీయం దర్థి భువనంబుఁ
దనియింపఁగల మహోదారగుణము
నివసించు నీలేఖినీ ముఖంబున సము
ద్ధత ధీరతా సముత్సాహరచన
పావనంబైన జాతీయ భావభూతి
ముమ్మరంబుగ నీలోన మొగ్గదొడిగె
నాయు రారోగ్య విభవ మర్యాద లంది
కీర్తిఁ గాంచుము; శ్రీరామకృష్ణ సుకవి!"
అనెడు కవికోకిలకు జాష్వ కంకితముగ
నా 'ప్రమోదకుమారు' వాక్యములఁ బట్టి
యల్లుకొను 'సూరబాల' కావ్యంబుగాథ
నింక నీతీరున సమన్వయించువాఁడ.



# కథాప్రారంభము

(పూర్వభాగము)



సూరబాలయు రామకృష్ణుండు ననెడి
వార లిరువురు నారయ బాల్యసఖులు
దాని నా కిటఁ జెప్పక తప్పదేని
వార లానాఁటు మఱి కామవశులుగూడ.

పిదప 'సూరబాల' యొకరిని బెండ్లియాడెఁ
గాని యామె తన పూర్వేచ్ఛ మానుకొనదు
దాప నేమిటి కామె యందంపు నయిత
మట్టి తలఁపునె కలిగియున్నదియ యంట.

ఇంక నా రామకృష్ణు గణింతుమేని
యతని బూర్వఁపువాసిగ ననఁగరాదు
నేఁడు భగవంతు 'నెచ్చెలికాఁడు' మఱియుఁ
గవివరేణ్యుఁడును నటకాగ్రణియుఁ జెప్ప.

ఇతని పుత్రోదయముఁగూర్చి యిందు నెవరి
కానగింజంతయుఁ బనిలే దయినఁ గాని
అప్పు డాతఁడు సుతుఁ జూచి యాడురీతి
నాపుకోలేను పో కవినయిన నేను.

"స్వామి! నినుగూర్చి నాపూర్వజన్మమునందుఁ
జేయుతపములు నామదిఁ జేగ వయిన
దయను నీనాఁటి కీవు ప్రత్యక్షమగుటఁ
'వత్సాలంబెకజా!' యంచుఁ దలఁచువాఁడ.

ఇలను నీబోఁటు లీదారి నేగుదెంచి
యెందఱో చూచుచుండ నదృశ్యులగుదు
రంత పాపాన నన్ను నీ వనుపకుంట
నుర్విఁగలవారి నేన ధన్యుఁడను దేవ!

పరమయోగిగ దిగంబరుఁడవై యుండగ
నంబరంబులఁ గట్టి మందు రనుచుఁ
కాలుమాత్రమె త్రావి కాలంబుఁ బుచ్చఁగఁ
బ్రాశనంబులఁ గష్టపరతు రనుచు
స్వైరవిహారంబు సలుపుట మది నెంచఁ
బేరు త్రాడునఁ గట్టి వేతు రనుచుఁ
కాప మొలుఁగని ప్రేమభావంబు నందఁగ
మోహవారిధిఁ బట్టి ముంతు రనుచు
నెన్ని ప్రొద్దుల ఖేతిలి యేస్తు వీవు
దీని నిందాక నేఁను దెలియలేను
తండ్రి! యిచ్చోట నిది సాంప్రదాయమంట
యేమి సేతును నను క్షమియింపవలయు.

నాప్రభూ! యీ దోసం గాక నాకెగాక
యొల్లి స్త్రీచేత నొక్కఁ డిట్లేమ్చునేమొ

యెట్టి వాగ్దాన మీవు నా కిచ్చినావు?
తెలియఁ జెప్పుము! కొంత శాంతింతు నేను.

నాదు తండ్రికిఁ గలుగు నామీఁదిప్రేమ
నిన్ను జూచుటనె తెలియనేర్చినాను
నుడువనేరని నాదేశికుఁడవు నీవు
స్వామి! నీ పాదములకు సాష్టాంగ ప్రణుతి."
అనెడి యాతని మనసు నే మనఁగవచ్చుఁ
పుస్తకిని వచించునేమి? 'దేవుం'డటంచుఁ
గలదె యీ వింత భూమి నెక్కడనుకాని
కవుల భావాలకే మ్రొక్కనవునుగాక.
ఇంతమాత్రకె పొంగి నే నేమొ చెప్ప
నక్కవిశ్వరుకలమున కందనట్టి
భాగువిరాజిన యొక్క భావంబు గూడ
మచ్చునకు లేదు నాఁటివాఙ్మయములోన.
వలయుచోఁ బూని యంతటి వ్యాసునయినఁ
బరిభవము జేయుఁ దనదు భావమునఁజేసి
'యనృత' మం చని యెవరేని నందురేని
దానికిని జూపు దొక్క నిదర్శనంబు.
వ్యాసభారతరచనంబు నరసియరసి
పాండవుల కెన్నఁ దాఁ బక్షపాతి యనుట
కెందఱో కవితిలకు లేమేమొ చెప్ప
అప్పు డిక్కవి వ్యాసు నెల్లాడె నౌర!

“ఇత్తెఱఁ జెప్పనీ కనయ
నెంచిన యంబిక నిన్ను రోసి క
న్నెత్తియుఁ జూడకుండుటయు
నింకను దాసి నొకర్తుఁ బంపు డా
యుత్తరమంపు నాయమ స
హోదరి ఛీతిలి నీకుఁ గూర్చుటల్
సత్తియామె యటంచు నిను
జాలుదఁ బొమ్ము! పరాశరాత్మజా!”

భారతి పోల్చి యంతట ‘సె
బా’ సనె, వ్యాసుఁడు చచ్చిపోయి యా
భారత మిద్ధరిత్రి వడిఁ
బాఱగఁజేచు చరణ్య మేగె? నె
వ్వారల కెప్పుడుం గురుతు
బట్టఁగరాని మునీశవృత్తి, నీ
కారుణి నెల్లరుం ‘గవి’ ప
దంబున నొప్పుదు రెంత సిగ్గొకో!

ఇంక నాతని పాపమ్ము నెఱుఁగుపొంచె
తనవచించిన స్వీయవక్తృం బదేమొ
కాని నీ తావునందు నుదాహరింతు
నాదిదేవునిఁ గూర్చిన దద్ది సెప్ప.

“త్రిభువనంబుల నొకట మూర్ఛిల్లఁగొట్టు
నంత సౌందర్యమయిన మో మందియుండి

యుగయుగంబున ధర్మంబు నుద్ధరించు
ఆదిదేవుఁడ ! కొనుము సాష్టాంగములను.

పుణ్యపాపమ్ము లన మనఃపూర్వకముగ
నెందునయినను సరె యొప్పికొందుఁగాని
స్వర్గనరకంబులంగూర్చి చర్చసేయ
నెప్పుడునుగూడ నే సంశయింతు; వింటె!

ఇంక నా పాపముల గణియింతుమేని
యొండు రెండునఁ బయిఁబడి యుండ వెపుడు
వీని నాపల్ల నయిన నీ విధియె కాన
స్వర్గనరకాల నాకుఁ బ్రసక్తి సున్న.

విను మిది యిట్టు లుండ మఱి
విన్నప మొక్కటి చేసి కెవ్వ రే
మనుకొన నేమికాని; నిజ
మారయ 'నీవును కృష్ణుఁ డొక్కడే'
యనుచు నెఱింగియుఁ హృదయ
మా వసుదేవకుమారునే తలం
చును; దయచేసి యట్లె ననుఁ
జూడఁదలంపుము నీవు సైతమున్."

ఇట్టి హృదయంబు గల రామకృష్ణకవిని
జేరి 'సూరబాల' వింతలు సేయు డాతఁ
డామెఁ గన్గొని యెంతయు నారటఁ బడి
తిన్న నొనరించు ధర్మోపదేశ మిట్లు.

ము

ల్యమందున నజ్ఞానవశతఁ జేసి
గుపవాని నెన్ని యెంచితిమొకాని
నింకమీఁద నీకు భావంబులోన
నవలవదు; మఱచిపోవలెను సూర!
ననుఁ జూచియే కాక నింకఁగూడ
ారినె పడిపోవ నెంచి తంట
! నావిన్కి యన్నృత మటంచు కాన
నా సాహసోక్తి మన్నింపవలయు.
ంపునె నీకు కన్యాత్వ మెప్పుడో
ఁ గలిపితి; వేఱ కర్మం బదేల?
ఫ్రులనఁ జేతలకుఁ జెప్ప దై వదృష్టి
రెంటికె ఫలము లొక్కటియ; వింటె!
నంబున ధర్మంబు వీడువారు
మనమందు 'నింక నో దేవ నేను
ని వీడకుండిన వేఁడిఁ గొనఁడు
వచియించినను తప్పుకాదు, తల్లి!
భావంబు నీ పట్లఁ గాదుకాని
మునఁ బోవువారికిఁ జూపినాను
ప్రులెకాఁడె? యెంతటి మహిమయున్న?
లమెకాఁడె? యెంతటి పుణ్యమున్న!
మనలోన నింతకు నెన్నఁడయినఁ
హితంబుల నేమేనిఁ దలఁతుమేని

పరితపింతము ; మీఁద దైవంబు కలఁడు
మనల నీనాఁట నాతఁ డేమనఁడు; తల్లి!
కన్యగా నుండునప్పు డెక్కుతన నెల్లొ
పాప మెంచిననేమి? వివాహమయిన
నాఁటితోడుత నామె నా బోఁటులందు
సోదరప్రేమ నేప్రొద్దుఁ జూపుఁగాక!
ఇంతటను నీవు నాయర్థ మెఱుఁగవేని
నన్ను నీయన్నఁబోలెఁ గనంగవలతు
నేనుసయితము నల్లె నిన్నెంచువాఁడఁ
దెలిసి పాపంబులనె యేల తలఁప? తల్లి!”
ఇట్లతఁడు ధర్మమును వచియించుమీఁదఁ
దనదు సుకృతాన నామె సోదరిగ మారె
వసుధ నెందఱో తెలిసి పాపమునఁ బోదు
రకట! వారల దేవుఁ డెట్లరయునో కద!
ఇటుల ‘సూఁబాల’ జ్ఞాన మందుటయెకాక
చదువు నాతనిచెంతనే చదువుచుండు
నేఁడు లోక రెందు పోయి; తా నెఱుఁగనట్టి
చనవు నెలకొన్న కొన్నిముచ్చటలు సాగ.
దీన ‘సూఁశాల’నా రనుమాన మంది
వారిపయి మోపినా రపవాద మకట !
పాడుసంఘంబుమాటకె పాప మెన్న
నింత స్నేహంబు నదియు సహించునద్ది ?

అన్యకాంతల నేలు పాపాత్ములఁ గని
యిట్టి వీరలనటె సంశయించెనేమొ
అయిన సంఘానినే యేల యాడవలయుఁ?
బాపులగువారినే యనవలెనుగాక!

వారు తమమీఁద నటు లపవాద మోపు
డంత కవిమది కుద్రేక మధిక మనఁగ
రామకృష్ణుఁడు సూర నారసి వచించు
నిప్పు డామెకుఁ బదునాలుగేండ్ల వయసు.

"ఏమొ! యే జన్మమందున నేమి నోఁచి
నాకుఁ బ్రాణమ్ములగాఁ బుట్టినావొ కాని
యలిగి నీవారు నాగొంతు నదుముచుంట
నేను జచ్చియుఁ జావకున్నాను, సూర!

ఎట్లొ నాకోరుపూవు నా కేల చిక్క
దదియ ధర్మ మటంచన. బిదప నేను
కలసుగూడను దానిని దలఁప ననిన
నింకఁ బరకాంతవయిన ని న్నేమి సెప్ప?

పాడుబ్రహ్మ యొకఁడు పాపాత్ముఁ డౌఁగాక
సూరబాల నాకు సుతయె యనిన
నన్నుఁ 'గా' దటంచుఁ గన్నకూతులఁ బట్టి
వెఱ్ఱివారి కెట్లు వెఱతు నేను?

కనుల మనమోములను జూచుకొనుట యొకటి
తనివి తీఱఁగ మాట్లాడుకొనుట యొకటి

యనుచవే తప్పు లే దింక నన్ను మొకటి
యొందు నెవ్వనితోడ నా కేమి? చెపుము.

కఱువుఁ జించుకొనినఁ గాళ్ళనే పడుమాట
దలఁచి మిన్నకుండవలసెఁ గాని
పాప మింక భూమి భరియింపలేదు పో
పదియు నాలుగేండ్ల బాల! వింటె!

'అన్న' వానికి నొప్పి: యూర! మదాంధుఁడై
దానితో నొకఁడు వింతల నొనర్పఁ
'జిన్నాయనా' యంచు సిగ్గు లేక యొకర్తు
పతికన్న మూసి పాపంబుఁ జేయు
'నత్తగా'రని పిల్చి యల్లుఁ డొక్కఁడయూరె
యేల నల్ల నొక కన్ను గెలుపుచుండు
'రామకృష్ణా' యంచు రమణి యొక్కర్తుక
పొరుగూరఁ బడుగురపొంతఁ జేరు

వీరలను బోలెనుమి! 'వీరు వా' రటంచు
నిల్లె మెన్నన్నో యేమేమొ యేర్పరింతు
రిందునను నన్నుఁ జూచి నీ వేమొ యందు
వింక నీ పాడుహృదయూలు కేమి? తల్లి!

నీవు నన్నుఁబోలె నేనుసైతము నిన్ను
మఱచిపోయి కన్ను మలపలేను
నిన్ను నన్నుఁ బోలు నిష్కల్మషులు తప్ప
నన్ను లెవరు మనల నరయలేరు.

ఇల్లు విడనాడి వెలుపల కేగనట్టి
నిన్ను నల్వురకును దెల్పి నిల్పినాను
కనుకఁ బూనకు మే మనుకొనకు మమ్మ!
సత్యబద్ధంబు నామానసంబుఁ గనుము.

నాదు మైత్రిని కొంత జ్ఞానంబు నేర్చి
తనయగా నుండు నభిమానముననెకాక
రామకృష్ణుఁడు భగవంతు భ్రాత యనఁగ
నింత సెప్పెదు నేమి? నీ వేమి? సూర!

జనని చనుబాలతోఁ గూడ చనవుఁ ద్రావి
పాప మెఱుఁగని ప్రేమభావమున మెలఁగు
కవిని నై యుండు నామదిఁ గనఁగలేక
యెవ్వ రే మనుకొన్న నా కేమి భయము?

‘కవి యనెడు వ్యక్తి ధర్మమార్గానువర్తి
యతఁడు దేవుని చెలికాఁ’ డటన్న నుడిని
విస్మరించెడిని కవి కవిత్వ మనిన
నేను విలపింతు శ్రీరంగనీతి కాదు.

మానస మేమొకాని ‘సిని
        మాలను నవ్వెడి నాదు నాట్యరం
గానవె యన్యకాంతకు మ
        గం డగు వేసము వేయఁబోను నా
ప్రాణము వోవుగా కది య
        బద్ధము కాదు; కలమ్ముతోడు; ప

మానిసి నాకు భూమిని స
మానుఁడా? చెప్పుము; నీవ "తమ్ముఁడా!"
'బుద్ధియటన్న దానికిని
బోలిక యుండు' నటంచు న్యాయసం
బద్ధుఁడనై మెలంగుటలు
పాడుతలంపులఁ బోనుగాక! వా
క్సిద్ధిని నున్న నన్నుఁ దమ
కోపముఁ దీఱఁగ నేమొ యాడు దు
ర్బుద్ధుల మాఱు తిట్టి మఱి
పోవకనుందునె? దుర్నివారతన్."

'రామకృష్ణుఁడు' తన మనఃప్రకటన నిటు
సేయుటను 'సూర' యర్థంబుఁ జేసికొనియుఁ
జమవునకు నాఁటఁ బఠియించె స్వస్తివచన
మూర! సంఘంబుబల మేమొ యరయరాదు.
అంతటను బోవ హానిలే దయినఁ గాని
వానికంటికిఁ గూడ కన్పడదు సూర
యింక మాటకు వేఱ నే నేమి సెప్ప
నుర్వి నీకష్ట మరికి రాకుండుఁగాక!
ఇట్టి ద్రోహాని కతఁడు సహింప కంత
కుమిలి యిట్లేడ్చు నాంధ్రలోకమును జూచి
కటికవాఁడేని నిప్పట్లఁ గరఁగుననిన
నార్ద్రహృదయుండు కవి యెంత యడలకుండు?

"ఆంధ్రలోకమ! వెనుక నీ వరసియుందు
నాకు భగవంతుఁ డిచ్చు మనంబుఁ గూర్చి
యింక నే నన్న గ్రొత్త నీ కేమి లేదు
అయిన నొకమాట! నేను న్యాయంబు వలతు.

ఎందుకో యేమొ యిట్టి నాయెడ్బ సూర
'తల్లి' యనుమాటనేనియుఁ దలఁపకుండ
నిపుడు నే నన్నుఁ జాటున కేగు నంట
యింకఁ జెప్పుము నాకు చా వేల రాదు?

అంత 'హీనాత్ముఁ'డంచు న న్నాడునేని
మాటకరవున నామది మాడ్చవచ్చు
రాకపోకలఁ గొంత దూరాననుండి
తనను జూచుటకును నోచుకొననె నేను?

మాదుమైత్రిని నీ కనుమాన మున్న
నడుగు; మిప్పుడ నాహృదయంబుఁ జీల్చి
సోదరీప్రేమ రూపంబుఁ జూపువాఁడఁ
గాల్లిపోదేల? గడ్డితోఁ గాలమహిమ!

'ఇమ్ములఁ బల్కి- 'సూర' తుద
కీ విధి ద్రోహ మొనర్చు నాకుఁ గ
ష్ట మ్మొనగూర్చెగా!' యను వి
చారము నామది లేదుకాని, 'ధ
ర్మమ్మును దప్పి; రేపు తన
ప్రాణభయంబులఁ బాయుమీఁద దై

వమ్మ 'సవాలు' కే మని 'జ
నా' బిడునో! యని యుమ్మలించెదఁ
మొన్న నెన్నఁడో బలవంతమునను నిలిపి
'చెల్లెలివి తల్లి విది యేమి సెప్పు' మనినఁ
గోపమును బట్టి యటు బుసకొట్టిపోయె
నెల్లి మఱచెద? నెల్లి సహింతు నేను?
అంత వచ్చిన "నాథుఁ డి ట్లాడెనంట
సతికి గతి వింటె నాదుదోసఁబు లేదు
గంటగింపకు - కన్నీరుఁ గార్పఁబోకు"
మనుచుఁ జెప్పెదె? కడసారెనయిన సూర!
అంత నాతల్లి హృదయంబు నభినుతించి
కలముఁ జేఁబట్టి మూఁడు లోకములఁ గొట్టి
పుణ్యమును బోసి తనుబోలు బొమ్మఁజేసి
స్వర్గ మేలనె? యింత మోసం బ దేల?
మాయ యటన్న మాట నిను
మంత నెఱుంగగలేక నేను నా
మాయమునే యొసంగి; తది
మాఱడియయ్యె; స్వయంకృతై కమా
నా యపరాధ మిప్పుడు మ
నంబున వచ్చె; ఫలంబు నిచ్చె; త
ల్లీ! యిఁక దాని మొక్కెదను
లే; ముదమారగ నేడ్పువాకిటఁ

పోలితి నాకు నే నగుచు
"సూర తలంపఁగ నింపునింపు పూ
మాలిక' యంచు నింతకు న
మాయకవృత్తిని; నంతె కాని, యీ
లీల భుజంగమా తెఱుఁగ
లే; నిఁక నాబ్రతు కంత నీ విష
జ్వాలలనే రహించికొన
సాగుత! గుండియయుండు నంతకున్.

" 'వీఁడు మావాఁడె' యని మది విశ్వసించి
పుట్టెడు ధనంబు నిడుగొ గొంపోయి నీవు
దాయు' మనుమాట; వాఁ డేమొ సేయుమాట
యనుకొనక నింక నెవరి నే మనఁగ నేమి ?
ఓ యభాగ్యకవీ ! నీవు మాయ మునిఁగి
యీ యెడారిని 'హాహా' మం చేల యేడ్తు?
పుట్టుగాఁ బుట్టు నీదు కన్నీటిబొట్లె
దిక్కుగా నీకు నీవ శాంతింపు మింక."
అనుచుఁ దనుఁగూర్చి తానె యిట్లాడికొనుచు
నాఁటవగ మానుటకుఁ బూనినాఁడుకాని
యతని కయ్యది సుంత సాధ్యంబుకాదు
ప్రేమలోతుల దిగి విమర్శించు నెవఁడు?
పిదప నొక్కమ్మడిగ సూరహృదయ మంత
తనదు కన్నులఁ గట్టె యాడిన నతంపు

కడచుకథఁ గొంత నిట్టు లేకరువుబెట్టిఁ
జెల్లరే! 'సూరబాల సచ్చిన'దనంగ!
"నీవు సచ్చిన నీలోన నేను వత్తు
నేను సచ్చిన నాయందు నీవు కలిసెదు
నభయ మిచ్చిని యడుగు నా యనుఁగుసూర
నన్ను మఱచునె? నే నిది నమ్మలేను.
నటకుఁడయి యుండు దుష్యంతు నాథువలని
నా 'శకుంతల' గతికి మనంబునందు
గాయమువెండెదు సూర యీహాయి కాదు
సాక్ష్య మున్నది వెఱ్వఁ డసత్య మనును.
తదుపరి శకుంతల నతఁ డోజార్చునప్పు
డుదధిఁ బోలెనె యొక్కటు నుబ్బిపోవు
సూర తనకేంట నాదు కన్నీరుఁ జూడ
దనువుల నొసంగు నిది యసత్యంబు కాదు.

నా మోముఁ జూచెనా! నలిననాభునిఁ గూడ
తనకంట నొక యింత కనఁగలేదు
నా మదిందలఁచెనా! ప్రేమనిధులను కూడ
కలలోనె యూవంత తలపలేదు
నా నుడు లానెనా! తేనెమాటలఁగూడ
వీనులఁ గానంత వినఁగ లేదు
నా పిల్పు సోకెనా? అపుచున్నను గూడ
వచ్చి మాటాడక బ్రతుకలేదు

ఇంత వోసీక నే నాజ్ఞ నిత్తునేని
హాలహలమేని ద్రావును పాలఁబోతె
నాకుఁగా శిలమేని బణాంబుఁ బెట్టు
సౌర! నాయందు నున్న మహత్త్వ మెంత?
స్త్రీజనంబునకేనియుఁ దెలుపఁబోని
ముచ్చటలఁగూడ నెన్నో నాముందు సెప్పు
చనవు నాసూర నను జూచి చాటుకాదు
కల్ల లాడితి; నానాల్క కాలిపోను.
అంత యపవాదముంము నన్నరసి 'యేమి?
సెప్పు'మని రెండు పెదవులఁ జప్పరించు
ప్రకృతిమాత! మదంబ! సూబాల నాతో
మాటలాడదె? నామది మంటఁబెట్టె.
జనము లనుమాటఁ బది దివసంబు లేను
తన్నుఁ జూచుట మానుదు నన్నుఁ బిలచి
నేలఁ గన్నీటఁ దడిఁగట్టు బేల నయయొ
యేమి యాడితి! నాకోప మేటఁ గలియ.
దేవుఁడా! నేను శోకానఁ దెలివి మాలి
శుద్ధసాత్త్వికమూర్తి నాసూరమీద
మాసిపోలేని నిప్పులఁ బోసినాను
వానిఁ జల్లార్పవే! వేయి ప్రణుతు లిడుదు?
ఇంతవఱ కేను 'నా సూర యీమె' యనుచుఁ
జెప్పునది వింటె! యీనామ మొప్పదంట

యెవ్వరో యేమొ నాకేమె యెఱుకలేదు
సూరరూపమ్మొ కాని నా సూర కాదు.
సూర తనవారి దుర్స్థితిఁ జూడలేక
మూఁడు నెల లేను తను బాసిపోవుమీఁద
కాలనాహిని గర్భానఁ గలిసెనంట
నమ్మవచ్చునె? యేమి? నిజమ్మొ? దేవ!
అయిన నింతయు "సూ"హృదయంబు లేక
సూరప్రతిరూపమైన యీ మూఱుమోము
గడ్డిపోఁచగఁ జూచెద గంతు లిడెద
నింత యపకీర్తి మనతల్లి కేల? తండ్రి!
ఎవరిమీఁది ప్రేమ నిండాక నే నల్లి
పిచ్చివానిగ విలపించినానొ
అట్టి సూరబాల యవని బాయుటఁజేసి
నేఁడు నామనంబు నిశ్చలంబు".

ఇట్లు వచియించి నిశ్చింత నెసఁగుమీఁద
నతనిఁగూర్చిన దొకటి యీ దాడవలయు
సూర తనచెంతఁ జదువుకొంచుండువేళ
నప్పు డామెకు 'హిందీ'యుఁ జెప్పునంట.
నాఁడు తన దిద్దనిడు నొక నాల్గుహింది
యక్షరము లెట్లొ తనచెంతఁ జిక్కిపోయె
వాని నాతఁడు నేఁ డొక పటముఁ జేర్చి
పాటఁ బాడెడి నిల్లు చూపఱను జూచి.

"ఓయి చూపఱి! కనురెప్ప వేయకుండ
'నేమిది?' యటంచనఁగఁ జూచె దేలనయ్య?
నేను నీకంత దూరాన లేనుచూడు
వేఱకాదిది కథను జెప్పెదను వినుము!

ఏను వ్రాసియిచ్చితి హింది యక్షరాల్
నాల్గు, వీని నొకదినం బునందు
సూరబాల దిద్దుచుండెడి ద టనేఁ
గవిత వ్రాయుచుందు కలముఁబూని.

ఆమె విధిచేతనేలేని యదనునందు
హరిని జెందుట ముందు నీ వరయవేమి ?
దాన వీనిని నే నిట్లు దాఁచుకొంటి
రామకృష్ణుని ప్రేమ యక్షరంబు; వింటె !

ఇట్లు తనప్రేమ చూపఱ కెఱుఁగఁజేసి
కాలమాతఁడు నిశ్చింతఁ గడపుచుండఁ
బ్రేమ నెఱుఁగని కొందఱు ప్రేలుసూపి
'పిచ్చివాఁ'డంచుఁ దన్నురూపించి చెప్ప.

ఈ యవస్థను సూర వారేయటంట
పాపమా కవి కీర్తి కోపకి క
నతని ధనమంతయును కొల్లరాడిరంట
ధనమె కీర్తికి మొదటి కతంబటంచు.

ఇద్ది యంతయు నక్కవి యెఱుఁగు మీఁద
నహాహా! వారలఁగూర్చి యేమని వచించెఁ

తెలుపువారలకే సిగ్గుగలుగుననిన
వినెడివారల నింక నేమనుచుఁ జెప్ప?
"ఎవ్వరీ జన్మమున భాగ్యమేలుకొంద్రో
పోయిన భవానమటె పెట్టి పుట్టుచుందు
రంతియే కాని యెవ్వారి నరసికొనిన
కొంగతనమున భాగ్యవంతులరు కారు.
నా కనులుఁగప్పి యెవ్వారు నాధనంబు
దొంగిలించిన నేనింత దుఃఖమంద
నడుగువారికి నేను లేదనుటగాన
యింక నద్దానిఁ బెద్దగణింపఁ గాన.
ఇందునంగూడ కొందఱిట్టి జగాన
నన్ను దోఁచుచు బ్రతుకుచున్నారనంగ
నహాహా! పుణ్యంబు నాకింక నధికమనుచుఁ
బొంగిపోయెద సంతోషమునను నేను.
ఒక్కని ధనంబువలన నీ యుర్విజనులు
పెక్కురు మహాసమృద్ధిని బెరుగలేని
ముక్కుతో నిందునందునఁ బొడచితినెడి
కొక్కెరఁదలంపఁగా నింపుకొనదె కడుపు?
దాత తలపోయఁ దా, నస్వతంత్రుఁడేని
నాలి మెడలోని సొమ్ముల నమ్మియిచ్చు
నుండియునుగూడ నిచ్చుట కొల్లకుండి
యేమొ యేడ్చెడి లుబ్ధులనేమి చెప్ప?

ఇవ్వఁదగు సజ్జనాళికి నివ్వకుండ
ధనము నెవ్వారలేటికి దాఁచిపెట్ట ?
శాశ్వతముగావు మనుజులు చావునిజము
చచ్చుచు ధనంబు నెవ్వఁడు దెచ్చికొనును ?
ధనమె కీర్తికి మొదలింటి దనుచు నెంచి
నాధనం బెవ్వరేటికి నాఁచికొనఁగ ?
అంటె ! కీర్తికి హృదయ మొక్కటియెగాక
సిరిని గలవారలఁద ఱెచ్చెదరె యెపుడు ?

తల్లిగర్భంబు వెలువడఁ దాఁసిలెడి
ఆధనం బెంత పోవ నా కేమి పోవుఁ ?
బీదమగునాఁడె నన్నంటి పెట్టికొన్న
నాయదృష్ట మదొక్కటి నాదిగాక !
ఇల్లొక ధనంబె దొంగిలి యేలపోవ ?
నుండు నాయిల్లు నగ్ని కాహుతిగనిండు
కవిన్ని; నా భాగ్య మెపుడు తగ్గదు నిజంబు
గోఁచిదాల్చియుఁ గీర్తిని గొనెద నేను."

అనుచు నాతఁడు తన పేరిమ ధనముజూడ
నాపటంబును పాపాత్ము లపహరించి
రకట ! యక్కవి కిద్ది యేమనఁగవచ్చు
గోటిముట్టును కోకంటి పోటుగాక !

ఇందుకను నిట్టిబాధల నొందువార
లయ్యు ! యని యేల నాబాధ మందిపోవ ?

ప్రసవవేదన కన్న వారలకుఁ గాక
తెలియనెట్లగు వట్టి వంధ్యలకుఁ జెప్ప ?
అంత యక్కవి తనశోక మాపలేక
విధిని నిందించి వారి శపించు నంట
ప్రేమయందలి సౌఖ్య మదే మొకాని
నాకువలదద్ది యెన్ని జన్మములకేని.
"సూరపోయిన నేమి? యీసోదరియిడు
నక్షరంబులె పొమ్మ నా యడలు మాన్పు'
ననుచుఁ బటమును గట్టించి యునిచికొనఁగ
నద్దియును నీకుఁగను గుట్టైనా? విధాత !
అయినఁగానిమ్ము! యేప్రేమ నవని కివ్వ
నేతఁ డింద్రాక నెమ్మయి నేడ్చినాఁడొ
యతఁడు దానినె పగఁబట్టునంతె తప్ప
యింత కష్టంబు కవి భరియింపలేడు.
ఆ మెయి మాయమయ్యెడి మ
హా మయి, సోదరి సూరదిద్దు మ
త్ప్రేమ ధనాక్షరంబులన
దృశ్యముఁ జేసెడివారికింక నీ
భూమిని వీఁడు దాక కృత
పుణ్యసమార్జితమైన సోదర
ప్రేమ నశించుతజ్ఞ శత ప
రీక్షల నే నొక దేవు భ్రాతనేఁ."

44-2

ఇట్లు శపియించు నా రామకృష్ణున కేఁక
బ్రతికియుండుట మిత్రుల భారముగఁ దోఁచె
నయ్యయో! నేను నామన మరయకుండి
యెవరిమాటనో యీ పూన్కి కేల నాకీతి?
హృదయమా! యెట్లనేని సహించియుండు
నాకుఁ బయికథఁ జెప్పకుండఁగఁదీఱ
దంత నాతఁడు మది భగవంతు నెంచి
తనమకసిదీఱ నిట్లు విచిత్రముగఁ దిట్టె.
'నరకుఁ డనుపేరుఁ గాంచియు బలిని జేరి
యేనె యాచించి' తంచు నీ కేల చింత?
అదితిచనుబాలమాట నీమదినె యున్న
బ్రహ్మకులమున కిది స్వభావంబు; దేవ!
'భృగుఁడు నను దన్నినను మాన మేమిలేని
యేనె రావణుఁ జంపి' తం చేడ్వ నేమి?
ఈవు కౌసల్యచనుబాల నెంతువేని
రాజవంశంబు రక్తంబె త్రావుఁ దండ్రి!
'బ్రహ్మరుద్రుల శాసించుప్రభుఁడ నేనె
పశులఁ గాచితి' నని దుఃఖపడెద వేల?
ఆ యశోద నీమదిని లేదాయె కాని
గొల్లకులమున కిది యయ్యకోలు; నాథ!
ఇంక నిందాక ముక్తి నా కివ్వకుండి
ఇట్లనే నన్ను కృశియింపనెంచ నేమి?

పించెను! పూతనచనుబాలవిషము మాట;
రక్కసులగుండెకరుణ హుళక్కి దేవ!
అనుచుఁ దనమాట కెవ రెదురాడకుండ
రామకృష్ణుఁడు దేవుని రక్కసుఁ డనెఁ
గవులభావంబు 'లిట్టివి'గాఁగఁ జెప్ప
బ్రహ్మతాతకుఁగూడ తరంబు కాదు.
ఔర! యానాఁటి నుండియు సూరబాల
భీతి నాతని గని ప్రేమభిక్ష కేడ్చు
గాకు లవి చూచు నని కాటుచీఁకటులను
'సూర చావదు; నామోముఁ జూడు' మనుచు.
ఈ విచిత్రానికి గత మదేమి కాని
'కలఁడు భగవంతుఁ' డని మీఁదికథ వచింతు
నంత నాతఁడు తనహృదయంబుఁ జెప్పి
'ఔర' యన నింక నామె నూరార్చు నిల్లు.

"సోదరి! నీదుమోముఁ గన
సూరవె నీ వని చెప్పకుండఁగా.
రా, దిది యెట్లయిన సుత
రామును నాకుఁ బ్రసక్తి లేదు, నీ
పాదము లాన! సూర ననుఁ
బాసె నటంచని యెప్పు డాడితో
మేదిని నింక నా బ్రతుకు
మేరకు నన్నిఁట నే విరక్తుఁడన్.

ఇంతటనుగూడ నీవు న న్నెఱుఁగకుండి
యుల్లనే యింకమీఁదట నేస్తువేని
'నామనంబునకన్నను నల్లగాయి
మే' లటంచను మాట శమింపవలెను.

నాఁడు కలలోన నూరక న న్నరసి విడచు
ఒక్క కన్నీటి చుక్క కే నోర్వలేను
నేఁడు నాకంట నీదు కన్నీట మునిఁగి
నుంత కఱగని యొక రాక్షసుండ నేను.

'ఇందున కే నొకింతయు స
హింపగలే' నని పాడు సాహస
మ్మెందుఁ దలంతువేమొ! భవ
దగ్రజు న న్నిఁక నీదుచేతులన్
మ్రిందగఁ జేసినట్టి ఘన
పాపము నిన్ను వహింప నీ క్షణ
మ్మందున నొట్టు బెట్టెదను
మానుమ! యయ్యవి పాపకర్మముల్.

ఈవు నామాట నీపతినేని నిపుడు
కాలఁ దన్నంగ నొప్పుదు గాని యద్ది
పరమహీనాత్ముఁ డయ్యెడివాఁడె తప్ప
నన్ను బోం ట్లాడరమ్మ! యెన్నండుఁగూడ.

'ఎవరి నూరక నెవరు దహింతురో యిల
వారు నూడఁగ వారె పాపమునుఁ బోదు

రనెడి నుడి యుండ 'వారు పాపాత్ము' లంచు
నింక నా కూపమున నెవ్వ రేల మునుఁగ?

ఎట్టి కష్టంబు లెటు ఘటియిల్లరాదు?
'నాదు మంచికే' యంచు మనంబునందుఁ
'దలఁచి సంతోషపడువారు ధన్యు' లనెడి
సూక్తి నీ కిత్తుఁ గొని దీనిఁ జూపుమమ్మ.

ఇద్ది కూడను నీవు సహింపకున్న
'సూరనే నేను! నామోముఁజూడు' మంటి
దాన నొకమాటఁ జెప్పెద, దాననేని
నూరడిల్లుము నాదు బంగారుతల్లి!

ఆరయ నిట్లు నాహృదయ
మగ్గికి లో నగుఁగాక! నేను నా
సూరను కన్ను మూసియును
జూచుచునుండెద, నీవుగూడ నా
తీరున నుండి నీమదిని
దేర్పుము; ప్రేమకు నింతకన్న నీ
ధారుణి నేమి కావలె? వి
ధాతృదురాకృత మెట్లు తీఱెడిన్.

ఏను ముంగల నీపూన్కి కెంచినట్టి
పూర్వభాగంబు నింతట ముగియఁజేసి

ఆ ప్రమోదుని కడమవాక్యముల కింక
నల్ల నుత్తరభాగ మిట్లల్లువాఁడ.

---

## ఉత్తరభాగము.

సూరబాలకు రామకృష్ణుండను చదువు
చెప్పునాఁటిది యొకటి వచింతుమేని
అప్పు డామెను జూచి మోహాంధు డయిన
పాడు హీనాత్ముఁ డొకఁ డేమొ యాడె నంట.
ఆమె యామాట నపు డొక రామకృష్ణు
చెవిని వేయుచు మఱి యేడఁ జెప్పకుండ
నాతఁడే మీఁద 'సూబాల' మాతతోడ
సర్వ వివరించె నంట నాద్యంతముగను.
బాపురే! యామె పుత్రియవస్థ నెల్ల
వినియుఁ గూడను వాని నే మన దటంట;
యిట్టితల్లిగ నెవరి కూహింపవచ్చు?
నెవరి కున్న రహస్యంబు లెవరి కెఱుక?
ఇందునకు నాతఁ డింత సహింపలేక
వారి యీ నేమమును సూరపాటు నామె
ప్రాణనాథునకే లేఖ వ్రాసె నంట
అదియు తనసేయు నేర మటంచుఁ జెప్ప?
ఆతఁ డా లేఖ నిప్పట్ల చేతులార
సూర తలిదండ్రులకె విప్పిచూపె నంట

అంత కొకముందు వారి కిం కేవో కొన్ని
యుత్తరా ల్వచ్చెనంట పేరూరులేక.
ఇంక నాయింటిమొకఁ డిర్వదేండ్లవాఁడు
తనయవస్థను రామకృష్ణునకుఁ జెప్పి
డాతఁ డొక కొంతబంగార మతనినుండి
యమ్మగాఁ జేసెనంట స్వహస్తముగను.
పలుకు లింకేఁటి కా సూరవార లంద
'చిన్నిఁటికి వాఁడె' యని రామకృష్ణుమీఁద
నెన్నియో చెడ్డపగల వహించి యంత
కెంత కేనియు నోడిఁగట్ట నెంచిరంట.
దీని నంతయు నక్కవి తెలిసికొంచు
కత్తితో సాము నొనరించుకరణియంట
చెప్పరే! సూర కొక లేఖ వ్రాసెడి నిటు—
లిప్పు డతని కిరువది మూఁడేండ్ల వయసు.
“బండొరుల చూపు లట్టుల రెండు మాఱు
లొక్కటయి కూడ మాట్లాడ కుండవలసి
వచ్చు డీయుత్తరము నీకు వ్రాయుచుంటి
చెల్లెలా! సూరప్రతిమోహ! చిత్తగింపు.
వెనుక; దురాత్ముఁ డొక్కఁ డటు
భీతిఁ దలంపక నిన్నుఁ జూచి యే
మనియెనొ నీమొగంబుననె
యంతయు నారసి నీదువారు వా

నిని కడుముద్దు సేయుటలు
నీవు నెఱుంగుదు, విందు నాదు క
ల్పన మొక గర్వ కేనియు హ
శక్కికదా! యింక నేమి సెప్పుదున్?

అక్క నీవారు నీశీల మరయ రనెడి
యక్క నామది మండ నీయనుఁగు పతికి
నీదు దైన్యము వారల నేమొ యొకట
తెలియ వ్రాసిన పాపంబుఁ దెలిపె నేఁడు.

ఈవు నాతోడ నంతగ నేడ్చు టొకటి
యేను నాసోదరిగను ని న్నెంచు టొకటి
ప్రకృతిసంబద్ధమగు ననురాగ మొకటి
యింత తెచ్చె నటంచు దుఃఖింతు నేను.

ఔర! నాయుత్తరమునె నీవారి కిచ్చి
నన్ను దుర్భాషలకుఁ జూపి నవ్వ నేమి?
పుణ్య మని పోవఁ బాపంబు మొదటఁ బడునె?
ఫలము నొందెని నీ ద్రోహబుద్ధి యున్నె?

ఇట్టు వీ రంద ఱభిమానహీను లయిన
నే మొకో – నిన్నుఁ దేర్చువా రెవరు లేరొ
సోదరీ! నూరపత్రిమోహము! చూడు మింక
నపరాధవ మేను మన్నింపలేను.

సముదాంధుఁడు భీతి యొక్కింత లేక
అక్క నీ మోముఁ గని మోహ మందినాఁడొ

వాఁడు తనపత్ని నీకమీఁద గూడునేని
తల్లిఁ గోరెడిపాపానఁ దరలుగాక!
అట్లు నీపతి నాయెడ్ప నంత వినియు
'సూరతో నీకుఁ గల యట్టి జోక్య మేమి ?
అద్ది తలవంపు నా' కంచు నాడినాఁడు
ఒసఁగు మో తల్లి! నీవ ప్రత్యుత్తరంబు.
'సాధ్వి పత్నిని పతి యేలఁజాలఁడేని
న్యాయ్యమునఁ బోవు కవి తననాతి విడచు'
ననెడి సూత్రంబు సృష్టింతు నంతెకాని
నేను ద్రోహానఁ బోవంగలేను వినుము.

బలిమిని భగవంతు బంధించి బాధింతుఁ
గాలమార్గంబులఁ గలఁచివయితు
నింగి గుభిల్లున నేలఁ గూలఁగఁ జేతు
నర్కబింబముతేజ మంత నొంతు
ధరణీధ్రముల నెల్లఁ గరగిపోఁజూతును
ధర్మచయంబుల కర్మ మణఁతు
బ్రహ్మాండభాండంబు బ్రద్దలుగాఁ దందు
నంబుధు లింకుట కాజ్ఞ సిడుదుఁ
బ్రాజ్ఞుఁడేకాక నీపతి యజ్ఞుఁ డయిన
'నితఁడు నీకైనయట్టి ప్రాణేశుఁ' డనెడి
మాట మఱతును, నా కేమొ సాటిలేదు
'అట్లు రాకుండుత!' అని నే ననెదఁ దల్లి!

ఔర! యింకను వింటె! పేరూరులేని
వరుసం దమ కేవో యుత్తరా ల్వచ్చె నంట
వానిగూడను 'హాండెపో వ్రాసె' నంచు
నన్నె నిందింతు రంట యే మనంగవచ్చు?
ఇలను కొందఱు దుర్మార్గు లెవరొ యుత్తు
వ్రాసిరే పోనిమ్ము! వాని నిప్పగిదిం జెప్పి
నల్వురందున నున్న మానంబుం దొరంగు
మూర్ఖు లుందురె? తమనోళ్లు మూసికొనక.
ఇంక నిరువదేండులవాం డ దేమొ సేయం
బిల్లవాం డని వానిం దప్పింతు రేని
నంత కొక్కంత పెద్దయ టన్నవాండు
వానిం బోలెనె యొకపిల్లవాండు కాండొ!
కాకపోవునుగాక ! బంగార మేమి ?
నేపు తనయూలి నమ్మంగ రేయం డేల ?
అట్లు సేయునె ? యీ నుంత యరయం డేమి ?
పిల్లవాం డంట ! యెవ్వాండు పిల్లవాండు ?
'తమ్ముండు సేయిచాపెను గ
దా !' యని సంతస మొప్పు నాల్గు రూ
ప్యమ్ముల నివ్వకున్న యొక
యన్నకుం బార మొసంగినాను 'ధ
ర్మమ్మె మదీయమార్గ' మని
ప్రాజ్ఞులు సెప్పరొ ? నాదుమాట లో

క మ్మెఱుఁగంగలేదో ? కల
కాలము నే నొక భాగ్యాంతుఁడన్.

తమ మొగముల కురూపముఁ దలఁపకుండ
కోపమున నద్దమునె నేలఁ గొట్టినట్లు
తమదుకల్మషహృదయాలకృమును మఱచి
యితరులను దిట్టిపోయఁగ నేమి ? తల్లి !
'ఇన్నిరూప్యమ్ము లతని కే నిచ్చి' తనుచు
నాఁడు నాపేరు జెప్పిననాఁడు నీవు
చూడవా? కమ్మలోని దస్తూరి యేమొ—
అందు నే మున్నదో — నీవ యాడుమమ్మ!
అట్లు వచ్చునటంచని యనుకొనియెగ?
యేను మొదటనె దాని వ్రాయించుకొంటి?
పాడు ద్రవ్యాశను నసత్యమాడువాని
జీవితము కాల్పనే? హిహి! సిగ్గు! సిగ్గు!
అప్పుడునుగూడ నేను వాఁ డాడినట్లె
అన్నిరూప్యమ్ములును కాలఁ దన్నలేదె?
అయిన నాతీరె యింక న న్నాడిపోసి
అనుభవింతురుగాక! పుణ్యంపుఫలము.
ఎందుకో యింక నందఱు నేక మగుచు
అక్కబలమున నన్నుఁ గాఱింతురంట
కాదయేని తుపాకినె కాల్తురంట
వారిపాపంబు నేఁడుగా! పండిపోయె.

అంబుధు లింకుఁ డారలు గ్రి
హంబులు కుంభిని గూలు నర్కబిం
బంబున వెల్లు లీన మగు
వాయువు లొక్కెడఁ దక్కఁ గాలమా
ర్గంబులు వక్రతం గదియు
గాసిలు ధర్మచయంబు నాదు తే
జంబు తుపాకిఁ బోవు నిను
సంబున మాటలు వేయు నేఁటికిన్.

నాకె గుఱిజూతు రేని తుపాకియందు
దింపు గుం డింక నెదురుగఁ దిరుగ దేమి?
అవని యొక్కట తమను కట్టల్కఁ గోసి
కుక్కలను నక్కలను బిల్వకున్నె? తల్లి!
అట్లు నీవాదు నన్నాడి రన్నవార్తఁ
బిట్టుకాలునఁ గట్టి పంపింతునేని
కవికుల మ్మంత గాండ్రించి కలములఁ గొను
రాముబాణాలు లెక్కకు రావు వింటె.

నాఁడు నామానసంబె తూఁగాడునేని
చూడ నిజముగ నే రాక్షసుండ నగుచుఁ
బచ్చి నెత్తురును జెఱకుపానకముగఁ
ద్రావి చూపింతు నా కసాధ్యంబు కాదు.

అంబ! ఈపాడుసేఁత కే నరుగు దనెడి
భీతిఁ గొని యింక నీవు కంపింతువేమొ

మాటవరుసకు నామదిఁ జాటినాను
కాని యంతటిక్రూరుడఁ గాను నేను.
కవికలముముందు నీవారిజవ మ దేమి ?
చూడ ముక్కంటిశూలమ్ముకూడ రాదు
ఒక్కమా అటు కలమును పొక్కదేని
భువనములు మూఁడు మసియయిపోవె? తల్లి !
కట్టెయందలి నిప్పొకకణము మండి
'బూడిద' యనంగ మాఱుచు భూమిఁ గలియుఁ
గాని, కవికలము వెడలగ్రక్కు నిప్పు
సమసిపోదెన్నఁ డది యాకసంబు మాత !
నేత్రయుగ్మంబు నెఱ్ఱనై నిప్పులొలుక
వేఁడి నిశ్వాసములను కెంబెదవు లదర
జలము స్పృశియించి యొకపల్కు పలుకుదేని
యేమి కాకుండు ? నానోటి కెవ్వఁ డుండు ?
సోదరప్రేమ తగ దని వాద మున్న
పండితులముందు మెప్పింపవచ్చుఁగాని
కొట్టులకుఁ దిట్టులకు నోడిఁగట్టు తలఁపు
గడ్డిఁ దినునట్టి పశువులకయిన నున్నె ?
కవిని గాఱించిన కర్మంబునని కాదొ ?
గంగ్రాజు జోలెను గట్టినాఁడు !
కవిని బోనాడిన కారణాననె కాదొ ?
సాహిణిమారుండు సచ్చినాఁడు !

కవిని నొప్పించిన కతననే వడికాఁడొ?

పోత నరేంద్రుండు పొలసినాఁడు!

కవి నేడిపించిన గర్వంబుననెకాదొ?

సింగఁడు దుర్గతిఁ జెందినాఁడు!

ఇట్లు నెందఱ పేరు లే నేమిచెప్ప?
విశ్వ మెఱుఁగును నీవుఁ వినియెయుండు
వింక ననుదిట్టి నీవార లెట్టిగతిని
జెందకుందురొ నేన చూచెదనుగాక!

పౌరుషజ్ఞానకీర్తులఁ బరగు నెవఁడు
సంపదలు వాని కొకపూట జాలునంట
కాన నాలేమి కెవని దుఃఖంబు వలదు
లేదు నామది కెప్పుడు పేదతనము.

అరయ నక్కేఁచఁ బదుగురై దురెయదేమి?
యెల్లలోకంబు లొక్కటై నెత్తిరాని
యెదురుకొని నిల్చి తగు పోరమివ్వ నేని
నేను నాతండ్రి కింక జన్మింపలేదు.

మానసమే ప్రాణముగ నాదుమేనఁ గలదు
ధైర్యకవచంబు దానికి దాల్చినాను
ధర్మమే విల్లుగాగ హస్తములఁ గొంటి
సత్యమను బాణములవారిఁ జంపు దింక.

అరయ నీవారు మగవారలయిన యెడల
వాదమున నిల్చి నను గెల్వవలెను గాక!
కొట్టఁ దలఁచిన నెవ్వాఁడుఁగొట్టలేఁడు ?
కలువఁ దలఁచిన నే కుక్క కలువలేదు ?

అప్పుడును వారు నాధాటికాఁగలేక
క్రూరముగఁబట్టి నాగొంతుఁ గోతు కేసి
ముద్దు నాసేయు పుత్రుఁ - పెద్ద పెరిగి
యుండఁజేసెడిఁగాక నా కాత్మశాంతి.

వాఁడు నాశక్తిఁగొనని పూర్వంబునందె
ఘోరముగ వారు వానిని గోతు కేసి
నేను తప్పక మఱల జన్మింతి నింకఁ
బాపిగోనువాఁడ నాయప్పు వడ్డితోడ.

ఏకెదము పీకెద మటంచు నింత కెగురు
తమదుమగవారి కేరికిఁ దరముగాక
ముండ లిద్దఱు నను గొట్ట మొఱుగుదు రఁట!
మొన్న నొక 'సోది రామన్న' ముందు భళిర !

మగని విడుచుముండ మబ్బువిడుచు నెండ
ఒక్కరీతి మండుచుండునంట !
యింక ముండలిద్ద ఱి శ్లోకమైనచో
నేమి సేయఁజాల రీ ధరిత్రి ?

ఇన్నిమాటల పని యేమి? యింతవఱకు
బుద్ధి నేర్వకయున్న నీ మూర్ఖతతిని
తమతమ పేరుల నీనాటకము జేర్తు
ధరణి ప్రత్యక్షముగఁ బ..కొనుము వింటె!
ఇంతటనుబోక వెడియు నిరుగుపొరుగు
నారులో నెంతురంట నామగారవంబు
సంబుధిని బోలియున్న దేశబుమాట
తెలియఁ గూపస్థమండూకముల కదెట్లు?
ఇందుఁ గొందఱీక నేమొ పెగ్గలఁగొట్టి
మాతి వకవోన ముఱియుచునురఁట
తురక లేనియూర దూదేకు సయ్యద
టున్న సూక యిపుడు స్వార్థకంబు.
పప్పుదప్పళాల వొప్పులఁగొనుచుండి
నిధవలంను వి..పిగనేమి?
యింటి కడపదాటి యీవల రమ్మను
ంక్కఁగూడ లెక్కఁగొనదు వింటె!
కలము జేఁబట్టి నాల్గు వాక్యములఁగూడ
తప్పులేకుండ వ్రాయువిధంబు లేదు
పుడమి నిమ్మయి నాంధ్రులై పుట్టువారు
కూడ బ్రతుకుటకంటెఁ జచ్చుటయె లెస్స.

ఇట్టి విజ్ఞానులీక నన్నుఁదిట్టిరనఁగ
నబ్బురంబేమి? తలి! చింతనందఁబోను
కాని యొక కోర్కె నామదిఁ గలిగియున్న
దద్ది విని నీవు పూర్తిసేయంగ వలతు.
జనని ! విక్రమ వత్సరమునకు సరిగ
వచ్చు నా కిరువదిమూడు వత్సరములు
సూర మటుమాయ మయ్యెడి కారణమున
సగము చిక్కితిఁ దోఁచెను సంశయంబు.
అంతకంతకు నాయాస మధికమయ్యె
గుండె గడియార మెప్పుడు కుంటువడునో
నేఁడు నిన్నుజూచి నేను మాటాడవలతు
నిదియ నాగోర్కె దీనికీ వియ్యకోనుము".
అనుచు లిఖియించు నాలేఖనందె సూర
చదివికొనియును తగని యసహ్యమొప్ప
నతని కయ్యదె క్రమ్మఱ నంపెనంట
స్త్రీల చిత్తంబు లెవరికిఁ దెలియవచ్చు ?
పాఠకా! నీవు యీ సూరబాలసేత
కిది యసంభవమంచని యేమియనకు
కలరు ద్రోహాత్మ లిల ననేకలువచింప
నశ్రుజలరాసులను హృదయములుకలవు.

అంత యొక్కవి యీ సూరస్వాంతమునకు
బాపురే! యంచుఁ దాఁ గొయ్యగాఱిపోయె
నంతగాఁజెప్పు సూర యిట్లయ్యెనన్న
నీ యభాగ్యుని యేమన్న నేమి? యింక.
తనతలంచెడి నా మొసత్యమునఁ దనను
తలఁపకున్నను తెలియరావలదు గాక
తెలిసి జీవించువాని యేడ్పుల నెఱుంగ
ననుభవమొకండెకాదె! యందునకువలయు?
అట్లు నాఁతడు నిశ్చేష్టుఁడయిన మీఁదఁ
గొంతవడి కెట్లొ స్మృతిఁదెచ్చుకొనుచు నకట!
యూహకందని యీ సూరద్రోహమునకు
తనకుదానయి యిట్లు రోదనము సలుపు.
"నాఁడు ప్రేమామృతంబు యీనాఁటి క్రూర!
సూరకువచింప విషముగా మాఱెనంట
యీ విషంబునఁ బుట్టునాయేడ్పులింక
జ్వాలలయి లోకమంతటఁ బరఁగుఁగాక.
ఎందఱేమన్న నేమి? నాయెంచుతల్లి
యొకతె మాత్రమునాకుగా నున్నదనుచు
నింతవఱకెంత లేనిసహించియుందు
నింక నీసూర నేను నేఁడేలవింటి ?

ఏదో యా మానమునఁ బాపమెంచువారి
మాటయాయిద్ది! నాకుఁ గామ మనుచునన్న
సోదరియె నన్ను వంచింపఁ జూచు నేని
యంతయు లేనట్టి నా ప్రేమ కర్థమేమి?
కామకలుషితముంగాని ప్రేమయొండె
యవనిఁ జెప్పఁగ బుధులు సత్యంబటాదు
రయిన నీ సూర ప్రేమ ముల్లంతరింపఁ
నేమి? నా ప్రేమ యంతయుఁ గామమేన ?
నామనంబునఁ బాపచింతను వచింప
నెంతమాత్రము లేకుండ నెఱిఁగి యెఱిఁగి
యింతగా సూర నన్ను దహించు నేని
ధర్మమెయ్యది? యింక నధర్మమెద్ది ?
సోదర ప్రేమయందున సాక్షిసోలు
మృదులసంబద్ధమైన నా హృదయమకట !
తలఁపఁగారాని రాతిగుండెలకుఁ జిక్కి
యింత విలపింప నేను భరింతునెట్లు ?
నష్టపడు ప్రేమ కెందునైనను వచింపఁ
గాఱుచీఁకట్లతోడి దుఃఖమ్మెయయినఁ
గష్టపడు ప్రేమ కెందువఁ గనినఁగూడ
భావమందున విస్మరింపమియుకాదొ?

కలసి మెలసి మాటాడు సౌఖ్యమునకన్న
దుస్సహ వియోగ మొక్కటి లెస్సగాక
సూరయీ ద్రోహమును జేయఁజూచు నేని
యింకనాగుండె బ్రద్దలై యేలపోదు ?
ఇంత నేసియు నేదుఃఖ మెఱుఁగనట్టి
నన్ను నమ్మించి నాజీవనంబునంత
తీరరాని విషాదగీతికలఁ దేల్చ
బుణ్యపాపంబు లందెందుఁ బోవుసూర?
తనకుగా నేను నాజీవితంబునంత
నొకటవృధజేసి యిటుతుదకొక్కమాటు
తనను జూచుచు మాటాడఁదలఁచియుండ
నింతద్రోహమ్మె ? యింకనాకేది బ్రతుకు ?
ధరణివచియింపఁ దానెంతతల్లియయినఁ
దనను జూచుచు మాటాడఁదలఁచువాని
కేదొయొకమాట జెప్పకపోదటన్న
నేదియునులేక నిటుసేయనేమి? సూర !
అందునను గూడ నయ్యయో! యప్పు డప్పు
డుత్తరము వ్రాయుమంచు నన్నొత్తి పలికి
తుదకు తానయి నాకెంతదూరమయిన
నేమటంచేద్దు ? నీసూర నేమనందు ?

58-5

ఇట్లుగా మాఱు నీసూరనెంచి యెంచి
యామె మఱచి సుఖించౌదనందుఁగాని
కన్నుమూసియు సూర నే గాంచుచుందు
నీ ప్రకృతిలోన నింక నాకేది దిక్కు ?

ఇంత ద్రోహమ్మొ యీతల్లి యెంచునేని
సూర జచ్చినదంచు నే నూరడిల్ల
నా నిశీథమ్ములందు నన్నరసి మఱల
యేల నాప్రేమ కోసము ల్లేడ్చిపోను?

అంతతో నేను నాదుఃఖమంత మఱచి
ధర్మమున నామె నేమొ యోదార్తుఁగాని
యకట! యయ్యాదె నాదు కుత్సుకకు జెప్ప
నల్లు నురిత్రాడటంచు నే నరయనేల ?

అపుడు నాయాడినట్టి వాక్యముల కామె
యెంత కఠినాత్ముడంచు నన్నెంచినదియొ
యనుచు జింతించు నా హృదయమ్ము నింక
నింతగాసింప నాయేడ్పు కంతులేద ?

ఆ తలంచెడి తనదు ద్రోహమ్మునెంచి
యేడనోయేడ్చు నన్ను వెన్నాడి మఱల
అయ్యొ నాగొంతు నిట్లేల నదుమవలయు ?
నిదియ తన సౌఖ్యమునకున్న యది జగాన ?

ఏదో భావాన నన్నె ద్రోహిగ వచించి
యూర! యేమందుఁ ? దాఁ జచ్చునంతవఱకుఁ
దనదు ప్రాణంబు నాయందె దవిలియుండు
ననెడి నాసూర యర్థమియ్యదియ చెప్ప?
అంతయును నాకు తానెగా నాత్మ నెఱిఁగి
యుల్లె తనకును నేనని యాడు సూర
ప్రాణముండగ నారుధిరమ్ము ద్రావి
బ్రతుకునే యింక జంద్రతారార్కముగను?
ఇలను నాజీవితం బది యేమొ కాని
యెందుబోయిన ద్రోహమే యెదురువచ్చు
నెంతవఱదాక నిందు నే నేడ్వవలయు?
నేడ్చుచెందాక నీబ్రతు కీడ్వవలయు ?
ఈమె హృదయంబునంత నేనెఱిఁగియుంట
నడుగు చున్నాఁడఁ జెప్పుమో యాఁడుజాతి!
తాము గనుచుండ జరుగునధర్మములను
ప్రతిఘటింపఁగ లేని దుర్బలులె! స్త్రీలు!
మహిని నీయాఁడువారల మాటలనిన
నరయ కిందాక నే నేమొ యందుఁగాని
కడలుల సమూహములు వడగండ్లగుళ్ళ
భిన్నఘటతోయము, లన నొప్పితిని నేఁడు.

తల్లి యనుమాట తన యీ యధర్మమునకుం
నేను తనపేరుగొని యేడ్చినాను గాక
పాదసంఘంబు తనకున్న బలముజూప
క్షితిని నెందఱు కుమిలి జచ్చెదరొ? తెలియు!
తుదిమొదలులేని నాయురంతు దవిపాద
మెంతజెప్పిన నీసంఘ మే మెఱుంగు?
నేను జచ్చిన వెయ్యేండ్లకేని తెలిసి
గాసిం జెందెడింగాక యేకవి యొకండొ.
ఏను ముంగల మామైత్రి కేనె మునిసి
ప్రకృతిమోమయి తగని గర్వంబు గొంటి
నెవ్వరేనియు నిపు డడ్డి యేమటన్న
నేమిసెప్పుదు? నామాట కేమి బలము?
నన్ను గాజింతు మను నో జనంబులార! –
యిదియ సమయంబు నాలోన నేడ్పుతప్ప
నంతయు నశించె నింక నే ననంగ నెంత?
దివులు లేకుండ మీకసిం దీర్చికొనుడు.
ఔర! యిందాక నేను నా యాత్మశక్తి
దేవునేనియుం బట్టి బంధింతునంటి
సోదరకపీందు్రలార! నంజూడు డింక
గడ్డిపోంచకుంగూడను కాను నేడు!

ఊరక లభించు నా పటంబోర్వకుండి
చేతులారంగఁ జింపి వైచినది సూర
ప్రాణముల నేను నా సూరపటము బడసి
చూచికొని సంతసంపడ నోచికొన ను.

సూరమూర్తిని నాలోనఁ జూతుఁగాని
చూపజాల నను నా సూరఁ జూపలేను
పుడమి నేనయ్యొ! చిత్రకారుఁడనుగాక
ఏడ్చి యేడ్పించు కవిగ నిక్కేల పుట్టి?

ఎంత విలపించి యింక నే నేమిసేతు?
సూర యను పేరె నాకు నా సూరగాగ
సారెకును 'సూర' యంచు బంగారు పూలఁ
బూజసేయుచుఁ నే జచ్చిపోనుగాక!

రత్నమునుగోరి నేను సంద్రమును నకట!
వేక్క నెన్నియొ మున్కలు వేసినాను
రత్నమనుకొంటి నది నల్లరాయి యంట
పనిగ నా నెత్తి నీకఁ గొట్టుకొనెదఁ గాక!

నిత్య మని నేను నమ్మిన నింగి సూర
విఱిగి నానెత్తిమీఁదట నొఱగిపోయె
నింత భారంబు నేను భరింపనోప
నింక నీభూమిఁ గ్రుంగిపోయెదనుగాక!

నేను సలిలముగా నన్ను నిన్నదాక
తనదుప్రేమయె కట్టగా మనచి సూర
తెంపునను నేఁటి కాకట్టఁ ద్రెంపివయిచె
నే నధోగతి నింక నందెదను గాక !

సూరమాటల ధవళప్రసూనములుగఁ
దద్దయును బొంగి నాతలఁ దాల్చినాను
నేఁటి కయ్యవియే పండు నిప్పులయ్యె
నింక నిలువున మాడిపోయెదను గాక !

సూర నీప్రేమ దాహ మే దీరుతనుచు
నేమిలేని యెడారి న న్నేడ్వఁజేసెఁ
జేతు నేమింక ? నాతల్లి చిత్త మలర
బ్రతుకునంతకుఁ గన్నీళ్ళఁ ద్రావువాఁడ.

ఒసఁగె నా కేదొ సూర పీయూషమనుచుఁ
ద్రావితిని ప్రీతి దానినంతయును నేను
కటకటా! సత్యమున నద్ది గరళమంట
యింకఁ గష్టాన జచ్చిపోయెదను గాక !

"సూర" యను దేవదేవుండు ఘోరముగను
ప్రళయ మొనగూర్చె నేఁడు నాప్రాణములకు
నేను జచ్చిన నాప్రేమయేని మిగిలి
యమ్మహాంబుధి మట్టియా కగునుగాక !

ఎన్ని విధముల నేడ్చిన నేమి కలదు?
నా మనోవ్యథ నెవఁడు కనంగలాఁడు?
కుడితిలోఁబడ్డ నుడుతగఁ గొట్టికొనుచు
నేను మరణింతుఁ దప్పక నింత నిజము.

సరిగ యున్నట్లె నే నిష్ట చావకుండ
ఇట్టె నే గట్టుకొని యింక నూఁగ నేల?
నేఁటితో నన్ను జచ్చువానిగనె జెప్పి
మఱచెదనుగాక నా సూర మైత్రినంత.

ఏను మఱచెదఁగాని నా యీయెడంద
యొకరహస్యము దలఁపోయకుండ లేదు
తలఁచుటయె కాదు దానిని దాపలేక
వినిచి విలపించెడిని ఇంకవినుము జగతి!

అరయ నేబాలికను సముద్రాదుపట్ల
పురుషులకుఁ గానవచ్చుట బోలదంట
అట్టితఱి నా వియోగంబుఁ బట్టలేక
నేమిజేసెను సూర నేనేమిచెప్ప?

కలదు నా సూరకొక్కర్తు చెలమికత్తె
వలయుచో దానిపేరును వ్రాసియిత్తు
నడుగు దానిని నీవ రహస్యముగను
నన్నుఁ బిలపించి యేమేడ్చినదియొ సూర!

పాప మాచెలి యీసూరవలనఁ జేసి
పెక్కుకష్టంబుల ననుభవించెనంట
అది మనంబునరా 'అయ్యో' యనుటతప్ప
దానికే సాయమును సేయలేను నేను.

అద్ది మరణించి నరకంబు నరయునేని
యేను ధర్ముని నది క్షమియింపు మందు
నప్పుడు నతండు నామాట కొప్పుకున్న
పోని నాపుణ్యమే ధారబోతుఁగాక !
కొన్నిదినములె కనరాక నున్న నాకు
సూర యీ సాహసములఁ జొచ్చునేని
యింత తన ద్రోహమునకు నే నెంతయేడ్వ?
నవని! నాతల్లికేల యీ యాత్మహత్య ?
నావలన కొంత దోస మున్నదియ యనుము
దాని కింతటి ద్రోహంబు ధర్మమొల్లు ?
ఇంతకును నా యొనర్చిన దేమికలదు ?
తనను మఱచుచు నాతప్పుఁ దలఁచెఁగాక !
ఇంక నీ నాఁటనా సూర దృష్టియందుఁ
బుణ్యవతిదాను నేన పాపుఁడనుగాని
ఇంతకే నేను తలవంపనేల జగతి?
నన్ను మించిన పాపులెందఱు హాళికి—.

ఏను మనుజుండనై పాపమేలసేయఁ ?
జేసితిఁకఁ జేయనంటిని సేయఁబోవ
నయిన ధర్మంబుఁదన్ని జన్మాంతమ్ముగను
పాపములఁ జేయువారికే నోపుదెందు ?

'తల్లి' యని నేను పాపంబుఁ దలఁతునేని
నడుగుమో లోకమా! సూర నరసి వీవు
తనదోసంగుల నే దిద్దుకొనఁగ వేడ
నింత హృదయంబు లేక నన్నేల వీడ?

సూరకును నాకుఁగల మైత్రిఁజూడలేక
బోసికొన రెందఱన్ని నిప్పులను కనుల ?
సూరకును నాకుఁగల మైత్రిజూచువారు
తెలుప నెవ్వారలును లేరె యిలను నేఁడు ?

ఎవ్వరు ండుచు నేమేడ్వ నేమికలుగు ?
నాదు వ్రాతను నెవఁడు మాన్పంగలాడు ?
పూర్వమే నెచ్చెలికి ద్రోహమును దలంతొ
యనుభవంబయ్యె నీనాఁటి కాఫలంబు.

ఇద్ది యిట్లనెగాక మఱేమొ యనిన
నాకు సర్వంబు నీవ యంచనుచు నన్నుఁ
గౌఁగిలించుచుఁ గన్నీరు గార్చు సూర
యిట్లు నన్నేడ్వఁ జేయుటకేమి కతము?

ఇంక సూర ప్రసన్నయయ్యెడిని యాశ
నిష్ఠ నీ నిప్పులందున నిలువనోప
నామెకీనాఁట నేను నిరాశఁజెంది
బాధ శమియింప నాయాస పడెదఁగాక !
సూర యింతేని ననుదయఁ జూచుకొఱకు
ప్రాణములెపోని నేనింకఁ బాటుపడను
దుఃఖమున నాకుఁ గలుగు సంతుష్టిమాట
నమ్మలేను సుఖమున నున్నదియొ ! లేదొ !
నాయవస్థనుఁగని నల్లరాయియయిన
దయను నన్నెంచి వచ్చి యోదార్చుఁగాని
నన్నునమ్మింపఁ సూర నన్గఁ దొకెంత
ఈయెడారుల నింక నాకేది యాశ ?

ఇంతటనె పోవవలదు; నా యీనిరాశ
నామె యింకెంత రాక్షసి యయినఁగాని
నాదు మేనున హృదయమున్నంత వఱకు
ప్రేమకొఱ కిట్లె యేడ్చిజీవింతు నేను.
అకట ! యిట్లేడ్వ నాదు ప్రేమాగ్నియంత
బాష్పసంసర్గమున చల్లబడునొ యేమొ !
అందనేటికి యీ సంశయంబు నేను?
కనులనేమూసి యింకదుఃఖంబుఁ గొనెద.

అంధకారమ్మైగాక నాయాత్మ యిాక
దినమునాసన యునిన శాంతినివహింప
దోనిశీథిని! నీయుండె యొదిగియుండి
యవని నేనొక చిమ్మట నవుదుగాక.
ఏను చిమ్మటవలె సూరం కేమ్చేడేమొ—
ఆగిపోవుచు న్నది నాగళంబు
పయికి నాబాధనింకఁ జెప్పంగలేను
తుదకు నాయందె కమిలి జచ్చెదనుగాక!
ఏనుఃజచ్చుచు బూదియయ్యెడినిమీఁదఁ
నెట్టి జన్మంబునకు నింక నిష్టపడను
సూర దేహంబు మన్నుగా మాఱుదోట
గతికనయి బుట్టినా సూర గాంతుగాక."
అనుచు విలపించుచుండు నయ్యవసరమున
గోకిల యొకఁడు కూయని కూయుట విని
యద్ది తన వీనులకు నసహ్యముగ దోఁపు
డంత యక్కవి దానితో నాఁడు నిట్లు—
"కోకిలా! నేను నిను బలె కూయటంచు
నిన్ను కూయనిపించి మన్నించుదినము
లరిగె నెన్నఁడో నీకు నీ వయి యికెంత
కూసినను మానె నాచెవిఁ గొనఁగలేను.

వినుము చెప్పెద నాదు జీవిత విపంచి
నేఁటితో నంతులేని కన్నీఁటిశ్రుతిని
బాడునేగాని నీ బోంట్లఁ జూడదంట
కోకిలా! యేగుమిఁక వృథాఁ కూయనేల ?"
ఇట్లు వచియించు నా రామకృష్ణుఁకడకు
తోడి కవులంద ఱొక్కటఁ గూడివచ్చి
యతని యేడ్పులఁ దామందు వెతను దెలుపఁ
గొంత కోపాన నిటు మందలింతురంట.
"ఓ కవీశ్వర ! చెప్పు మీలోకమంత
సూరవలె రాయివోలెనె జూడవుగద !
యింత కెందఱు కవులు మా కెఱుకలేదు ?
ఇంత నిన్నింక మేము భరింతు మెట్లు?
ఏమిలేనట్టి యొకరాయి నేమొ యకట !
సూరగాఁజెప్పి యేల నిష్కారణముగఁ
జంపెదవు మమ్ము నీవు రాక్షసునిబోలెఁ
శాపమా ? పుణ్యమా ? యేమి బడయుదయ్య ?
భూమి కీ సూరఁజూపి నా ప్రేమయంత
కామమేనా ? యటంచు దుఃఖంబుగొందు
వట్లుగాదోయి ! మామాట నరసికొనుము
సూర ప్రేమయె కామమంచును కవీంద్ర !

కామమునఁ దేలు నీసూర ప్రేమ నేఁడు
ప్రేమనిర్వచనము తలక్రిందుగాఁగ
కామమునుఁ జంపు నీబోంట్ల ప్రేమనద్ది
యేడ్చి బ్రతుకుట కలదు కాదే సతంబు!

అయిన నారాయి కొఱకు జన్మాంత మిట్లు
యేడ్తునని జెప్ప మేము సహింపమోయి!
యువఁడవో గాక కవిగ నీవేల యయితి
పుడమి కంతకు నిక విసలబడవదెట్లు?

ఓ కవీ! సూరకనఁగూర్చి యుండునట్టి
యొక్క నిట్టూర్పునకును మే మోప మింక
నెవ్వ రెట్లిననేమి? న్నాకే మటన్న
నడుగు మెందును నీకు పుణ్యంబు లేదు.

ఆగ్రహింపకు మివ్విధి నాడితిమన
ఏకొను సుఖమ్ము తెలిసికోలేక కాదు
రాతికిని రానివట్టి సూరను తలంచి
చెప్పు మేటికి నీవు కృశించిపోదు?

అక్కటా! సూరఁగూర్చు నీయార్తి నరసి
కొండలేనియు నీరుగాకుండవనిన
సూరగుండె యదేటికి స్రుక్కిపోదొ!
మెట్టిదో యద్ది! యేమొకో...యెఱుఁగలేము.

ఓ కవీ ! మేము చెప్పెద మొక్కకథను
దాని లేఖయందు భేదంబె తప్ప
నంతట నొకండె నామసామ్యమునఁ గూడ
దాని విని యింక నీయేడ్పు మానవలయు.”

అనుచు వార లతని కాత్మ శాంతినిఁ గూర్పఁ
జెప్పనెంచి రొక విచిత్రగాథ
ప్రేమ మహిమ తెలుప స్వామి నిరూపించి
సంఘ మింక మీఁదఁ జక్కఁబడఁగ.

అంతమాత్రకు తనదుఃఖ మంతరింప
నక్కవి సుఖించునని యెవ్వఁ డనఁగలాఁడు ?
‘తలఁపులకు విరుద్ధములగుఁ ఫలితములకు’
దైవమును దిట్టిపోయ రెందఱు జగాన ?

“అట్లు నిన్ను బోలె నారామకృష్ణుండుఁ
దా లిఖించె లేఖఁ దనదు నూర
కామె దానిఁ జదివి యేమి యెంచెనో కాని
వినఁగబడియెఁ గులటయనఁగ దిశల.

అందువలను రామకృష్ణుఁ డాయోగ మంది
సూర్యుఁడేనియుఁ దనుఁ దేఱిచూడఁడనఁగ
కన్నుఁగవనుండి విస్ఫులింగంబు లెగయఁ
బరుసములనాడు నిటు సూరబాలఁ జూచి.
"బ్రహ్మయే యేల కాఁడు? నీపాలఁ బడిన
బ్రతికిపోవంగ లేఁడురా! రామకృష్ణ!"
అనుచుఁ బేరొందువాఁడు సూరనె తలంచి
తలను వాల్చెనె? యిట్టి ఋషిపుత్రులకు నేఁడు!
'అక్కటా! పిల్లఁ డొకనీటిచుక్కతోడ
దేటికుండెడు తేనెను జెఱచె' నాఁగ
నీకు సర్వంబు గానున్న నేస్తు నొకని
దుష్టతుద కిట్లు నట్టిటుఁ ద్రోసితేమి?
నీదువారు తమను నిన్నుఁ గల్పగఁ జూచి
పాడుమాట లెన్ని యాడరాదు?
నాక్కుఁగూడ నిన్ను నమ్మరాదనితోఁప
నింక నాదువాద మెందు వోను?
నీవు విపరీతములఁ బడిపోవు టెఱిఁగి
'యద్దియే' యనఁగ నబద్ధ మాడినావు
దాసనే కాదె? యున్నట్లు ధ్వనిని నిన్ను
హెచ్చరించితి; నింక నా కేది దారి?
తేరో? భూమిని నీ వయస్సుగల స్త్రీ
లెన్నండు మోహాంధులే

క్రూరో? వారలు, వారలం దవిలి దు
ష్కార్యంబులే సేయరో?
ఘోరో? యంతకు నెంత కేనియును రే
పున్నామపునం దక్కటా!
యేరీ? యుండిరె నిన్నుఁబోలి యొకరే
నే నింక ని న్నేమనన్?

అట్టివాఁ డట్టివాఁ డట్టియట్టికథను
జెప్పుచుండఁగ నెట్లు నీచెవుల వింటి?
పచ్చికులటయు నచ్చోటుఁ బాసి చనఁగ
నీవు నీపిత కేల జన్మించినావు?

వాఁడు దుశ్చింత కొడిఁగట్టినాఁడుగాక!
అట్లు గాకున్న నీకథ కర్థమున్నె?
ఓరి దుష్టాత్మ! నీసుత కొక్కఁ డిట్లె
కాచుకొనుఁగాత! నీకథ కాలిపోను.

ఇట్టి ని న్నింక నీపతి యేలకున్న
నేను నాదేవి నేల మన్నింపరాదు?
భీష్మరాట్పుత్రి యేమని పృచ్ఛసేయు
నామగుణముల రెంట నానాతిమిన్న!

'చెల్లె'లని 'తల్లి'యని నన్నుఁ జెప్పెనన్న
మాటయేనియు నీమది నాటలేదు;
దైవమా! యెట్టి పదములఁ బతితమీఁద
జెప్పినాఁడను నన్ను శిక్షింపు డెట్లు?

అరరే! నీ వింక నెపుడో న స్మరసిపోవఁ
జెప్పుకొన్నాను నా కింత సిగ్గులేదు
వస్తు; రావస్తు; నా కద్ది పాపహేతు;
వింకఁ బొమ్మావలకు నే సహింపలేను"
అనుచు రామకృష్ణుఁ డిటు త న్నాడు డంత
నామె యెంతయు సంతోషమందు మునిఁగి
'అయ్యయో!' యన నాకత మొయ్యన నిటు
లెఱుఁగఁజేసెడి నాతని కింకమీఁద.
"సూరఁబోలు నన్నుఁ జూడంగ నీ కిఁకఁ
బాపహేతు వనెడి పలుకు లిట్టుల
నీదునోటనె విన 'నిక్కువంబుగ నేను
ధన్య' ననుచుఁ జెప్పుదాన; వింటె!
ఎప్పుడు నాపతి నా పాటు కిష్ట పడెనో
అప్పుడె కులట నటంచు నీ వరయవలయు
నెప్పుడు నీలేఖ నిను తిట్ట కిచ్చినదియొ
అప్పుడె ద్రోహను; క్రొత్తగ ననఁగ నేమి?
నిన్ను నాకంటఁ జూచుట నేర మనుచు
నెప్పుడు నావారు నన్ను దహించినారొ
అప్పుడె నాలోని సర్వంబు నంతరింపఁ
బశువునై పోతి నాకు దైవంబె సాక్షి.
వాఁడు సర్వమయుండు సర్వంబుఁ దెలియు
నిందు నుత్తరవాదిని నేను కాను

కాన పనివడియింక నిక్కరణి సలిపి
నాడు కసిదీఱ పీరల మోదఁజేతు.
'నేను సెప్పినదేమొ నేనే యెఱుంగ'
నని వచింపకు మింతయు నార్తిఁ బడకు
మేను సూరను కా నామెమేను దాల్చి
యిట్టు లుండుదు నేమి నీయిడినభిక్ష?
కరుణ నామోము గల సోదరి నొకర్తు
నిట్టి పతి ముట్టుటకుమున్నె గిట్టఁజేసి
పాడుదేహము నామీఁదఁ బాఱవయిచి
తింత కోడిగట్టికూడ గర్వింతు నేను.
ఏమి సెప్పుదు నీస్థితి నీవు వ్రాయు
లేఖఁ జూచినమీఁద భరింపలేక
యేమి సేసితో! మఱి యది యెందుకొఱకో!
అరసికొను మింక నా పరమార్థ మీవ!"
అనుచు సూరిబాల తనచేత కయిన యద్ది
యిట్టు లెఱింగించుమీఁద నింకేమి సెప్ప?
'అయ్యో!' యనుమాట నేనియు ననెనొ లేదొ
అతఁడు తనగుండె యాగిపో నవని వ్రాలె.
అద్ది యెప్పుడు తనకండ్ల నరసినదియొ
యామె కూడను తత్క్షణ మట్ల యయ్యొ
నంతరంగాల ప్రకృతి మాహాత్మ్యమునకుఁ
బ్రాజ్ఞలోకంబు తన తల వాల్చిపోవ.

అనుచునుండఁగ నీకథ వినెడునట్టి
రామకృష్ణ కవీంద్రుఁడు భూమిఁబడియె
నరరె! యిదియేమటంచు వారందఱొకట
నట్టె యొకమాటు తనచుట్టుముట్టికొనఁగ.
చూడ నింకేమి? యప్పుడే వీడిపోయె
నతని ప్రాణచయంబు దేహంబునుండి
"అయ్యొ! నీప్రాణముల మేమె యపహరింపఁ
బోయితె కవీంద్ర!"యని వారు బొబ్బపెట్టి!
"ఇఁకఁ జూతుమే కవీ! యెందేని నినుఁబోలు
కవివర్యునొకని మాకనులనిండ
నిఁకఁ దిలకింతుమే! యెందేని నీలాటి
ధీరాత్మునొకని పృథ్వీతలాన
నిఁకఁ గాంతుమే కవీ! యెందేని నీయట్టి
నటకునొక్కని నే దినానికయిన
నింక వీక్షింతుమే! యెందేని నీబోటి
పుణ్యాత్మునొకని నీ పుడమిలోనఁ
గంటె! నెక్కడఁ గాటికి కాళ్ళుజాచు
ముదుక లే రోగములఁజిక్కి మూల్గరేమి?
మాటయందున నీ విట్లు దాటిపోవ
నీకెనిండెనె నూరేండ్లు నేఁడు? సుకవి!
ఏము నీప్రేమపద్యాల నెప్పుడేని
వినిసఁ జదివిన నీ వెట్లు కనులఁగట్టు

నపుడు మే మెట్లు మా దుఃఖ మాపనేర్తు?
మాప కేమింక నేమిసేయఁగలాము?
ఎట్టిభవనంబునందున నింక మేము
నొదలిముగూడి యున్న మా కేమి ముదము?
బ్రతుకునంతకు మాకింత వంతఁగూర్చ
మేముజేసిన పాపం బదేమి? మిత్ర!
పాడుసూరకు నీగుండె పగిలిపోవ
నేడ్చుటనెసూవె కథవచియింతుమిట్లు
దానినే నీవు మేము నందఱము నేడ్వ
నిట్లు క్షణమునఁ జత్తు వం చెఱుఁగమయ్య!
అయయొ! ఓదార్చి పోదమం చరుగుదెంచి
చెల్ల! యెవ్వాని నేమిజేసితిమి మేము?
దేవుఁడా! మమ్ము నీ వేని తెలిసికొనవ?
కటకటా! పాడు మాకథ కాలిపోను.

అరయ నిందాక నేసభయందునేని
నీవుమాతోడఁ గలహించిపోవునపుడు
బ్రతిమిలాడినచో మఱివత్తుగాని
యింక నీరా కకెందు మా కేమియాశ?

పాడుసంఘంబు భువిని నీబ్రతుకునంత
పండునిప్పులనే తెల్లవార్చినద్ది!
నీవు నేఁడేమియును గనలేవుగాని
పూజజేసెదమయ్య పూవులను మేము.

అదిర! నీజెప్పు ప్రేమపద్యములఁ గంటె
వసుధ నేకవి యవ్వాని వ్రాసికొనఁడు?
ఏమియూహింపరాని నీయెడఁద నుంచి
ఔర! యని నీకు నెవఁడు జోహారులిడఁడు?

నీకవిత్వంబునకుఁ జెప్ప నీవెగాక
సాటిరాఁ డింక నొకఁడు ముజ్జగములందు
భారతీదేవి మోదబాష్పముల నిన్నుఁ
గౌఁగిలించెడినంట! దుఃఖమునఁగూడ.

అంతకంతకు నావేశ మతిశయిల్ల
గుండెపయి చేయివైచి వాకొనుదు మేము
తెలుఁగు కైతపసందు నీకలమెగాక
పలుకుకల మింక లేదు, నిక్కువము జగతి.

కలదటన్న వానిగౌరవం బేపాటి?
కలిగియుండు వానికవిత యెంత?
దురభిమాన ముండి దొరలించెదరుగాక!
అదుపులేక తగుదుమంద్రుగాక!

తలపూని నీవు నీకలమును నడిపింప
నేయయ్యకవిత నిన్నెదిరినిలుచు?
గర్జించి నీవు నీఖడ్గంబు కదలింప
నేక్షత్రియునకు కన్నెత్తగాను?
దయనుంచి నీవు నీదాతృత్వమొలికింప
నేరాజు తన తల నెత్తికొనును?

మతి నెంచి నీవు నీ మంత్రి మా దేశింప
నేమంత్రి నీకు సలాములిడఁడు?
వలయుచో నింకఁ గోటికి పందెమొడ్డి
విశ్వమున నిన్ను మేమె చూపెదముగాక
ఒప్పి యెవఁ డెంత యెవ్వాని గొప్ప సెప్పఁ?
జెప్పి యెచ్చోట నెవఁ డెంత యొప్పు మెప్పు?
నేఁటిలోకం బదంతయు నిన్నుఁ జూచి
నిక్కి పడనిమ్ము నిప్పులఁ గ్రక్కనిమ్ము
భావిలోకంబు నీపేరు పటముగట్టి
గాంచెదవుగాక మన్ననఁ గలసి నీవు.

ఇష్టమైనవారి నిచ్చవచ్చినరీతి
నింగి కెగురవేయు నేఁటిదివస
మింత నిన్నుఁ గూర్చి యింక నేమియుఁ జెప్ప
మద్ది విలువలేని దవుట నెంచి.

అల్పులకె వచింప నన్ని గావలెఁ గాని
యింత నిన్ను బోంట్ల నేమి పొగడ?
నిండుకుండ కేమి నేర్పిన దోణకునే
కొంచెమునకె పెద్దగోడవగాక!

ధరణిజన్మించు వారికందఱకుఁ గూడ
నరయ నొకనాఁడు మరణ మున్నదియ యంట
యింక నీచావు నెంచి మేమేల యేడ్వ?
నీవు జచ్చియు బ్రతికియున్నావు పొమ్ము!

కంటె! మాలోన నీవొకకవివెగాక
నటకులందున నొకపెద్ద నటకుఁడవఁట
తలఁప నీరెండును లలితకళలెయయిన
నేది? నీనటనంబు? యింకెవఁడుజూచు?
ఔర! నాటకరంగంబునందు నేని
నీవుపరనారి భర్తగఁ గావటంట
దీనఁబురుషుఁడు స్త్రీవేసమూన వచ్చు
స్త్రీలు దానికి వలదని తెలియవచ్చు.
ఇంత కీవాదుతోడ మాకేమిగాని
యదిర! నీశీలమే నొల్పు నబ్బురంబు
కొడుకునకుఁ దల్లికే దంటగూర్చు సంఘ
మింక నీమీఁదఁ గనువేయ నేమిచెప్ప?
చూడ నింతకుగలుగు నీ సూరప్రేమ
పాపమో పుణ్యమో భగవంతుఁ డెఱుఁగు
నెంధు మాజూడకుండు నీయేడ్పువినియె
'ప్రేమచెడ్డది' యని ప్రలాపింతుమేము!
అద్ది గనుఁగొంటె యే పాపమయిననేమి?
అనుభవించెడివారు మీరగుచునుండ
ఏల? యీసంఘమున కింత యెగసిపాటు?
తగులఁబడియెనె? యట తన తాతసొమ్ము!
ఇంతకును మీదు పాప మ్మదేమొకాని
యింత నంతగ మార్చి యిట్లింతగూర్చు

పాపసంఘాని కేమి పాపంబులేదు?
దానిగద్దింప కెవఁడు ముద్దాఁడగలఁడు?
ఒదిగియున్నంతవఱకె కా దో కవీంద్ర!
సంఘ మింకను వారల సాగదీయు?
నెదిరికొని సూర దాని నీ వేమటన్న
నప్పుడీ సంఘ మేమిసేయంగఁజాలు?
ఎందుకో యిద్ది? యింత మాకెఱుఁగరాదు
తెలిసి యందఱ శిక్షించు దేవుఁ డుండ
వీరి దీపాపమని నిరూపించినట్లు
లెవరి కేమిటి కెవ్వారి నేడిపింప?

పాడుసంఘంబు పాపమ్ము బాపుకొఱకె
కంకణంబును తనచేతగట్టుకొని
యింతకును మించి పాప మ్మదేడ లేదు?
దాని కీసంఘ మెంతగఁ బూనుకొనును?

అరయ సూరయె కాదె యందఱమొగాన
నతఁడు గాఁడని యితఁడె యం చాడినద్ది?
దానిఁజెవులార వినియు నీమానవాళి
కేల యవ్వాని నిను కవీ! యిట్లు జంప?

చూడ నొకటనె మీరుంట గూడదేని
తల్లికొడుకుల కివి యేడ దారసిలవు?
అంత కేవారుగూడ పాపాత్ము లేమి?
చెల్లబో! సంఘ మెంతగఁజెడెను నీతి!

ఇయ్యవనిలోన పప్పు నరసయ్యలాది
పరమశుంఠలు వార లవ్వారుగాక
ఒక్కతండ్రికి బుట్టువాఁ డెక్కడేని.
నిన్నుగొట్టంగఁ దలపోయునే? కవీంద్ర!
కవిని గాటించి యింత కియ్యవని నెచట
నెవ్వ రేమాత్రమును సుఖ మేద్వరంట
యింక నిను వీరు వచ్చిన ట్లెల్లఁదిట్టి
యెడనే యేద్పలేద్వరో చూడవలెను.
"కవినిగన్న తల్లి గర్భంబు ధన్యంబు"
జగతి వాఁ డొకండు శాశ్వతుండు
వెక్కిరింత్రు కవిని వెధవలు కొందఱు
వానికాల రాదు వారిమొగము.
అరయ మీనాట చంద్రతారార్కముగను
పుడమియవ్వారిమీఁద నిప్పులనుబోయ
కవివరా! నీదుకథ నాటకంబు వ్రాసి
పంతమున దాని నీకఁ బ్రదర్శింతు మేము.
కాలమున కంతు లేదఁట కనఁగ నెపుడు
దేశము విశాలమంట యేదిక్కుఁజనిన
బుధులు నందందుఁ దప్పకఁ బుట్టుదురఁట
యింక ని న్నెవ్వఁ డేమన్న నేమి నేఁడు?"
అని యనేకవిధంబుల నతనియాత్మ
కక్కవీంద్రులు శాంతివాక్యములఁ బలికి

యతని దేహంబు దహనంబు నందుచోట
రక్తి లిఖియించి రిటు సువర్ణాక్షరముల.
"రాజ్యముల గెల్చి గర్వించు రాజులాది
భిక్షమెత్తుచు జీవించుఁ బేదవారు
నిందుననె నిద్ర గైకొందు రేకశయ్య
మానవా! వింటె! యిదియ శ్మశానవాటి.

బ్రతికియుండఁగ నది మూఢమతముగాని
యిందు నస్పృశ్యతకు తావొకింత లేదు
మన్నుఁగలియఁగఁ గనరాని మానవతతి
పుణ్యపాపంబులను జూపుముకురమిద్ది.

ఇచటనే రామకృష్ణకవీంద్రుఁ డకట!
గఱికమైపోయె సూరరాక్షసి నిమిత్త
మెన్నియుగములు దాటిపోయినను గాని
మొఱుఁగలే దిఁక చలన మా గఱికపోఁచ.

విసము నమృతంబుగాఁ జేసి మెసవఁజేయు
ముద్దియల ముద్దులొల్కెడి మోములెన్నొ
ఇక్కడనె వచ్చి భస్మమయ్యెడిని చూడ
'నా'దని వచింప నెవరి కిం దేది కలదు?

జగతి జననంబు సలిపెడి సకలప్రాణి
నేఁముగఁ జూచు నీచావు నెఱిఁగి యెఱిఁగి
యొకరి నమ్మించి యొకరు కుత్తుకలఁగోతు
రక్కటా! తాము చావకఁ దక్కురుకద!"

అనుచు లిఖయించి యక్కవీంద్రునకు నింకఁ
బుణ్యలోకంబు జేకూర మ్రొక్కులొసఁగి
యా కవీంద్రుఁలు తమ జాడనరసి రంత
"యింతకును జెప్ప దేవుఁడిట్లెంచె",ననుచు.
నా యభిప్రాయమున నొక రాయికొఱకు
బిట్టువిలపించుచింక జీవించుకంటె
యక్కవీశ్వరుఁ డట్ల యున్నట్లె యుండి
చచ్చిపోవుటయే చూడ చాలమేలు.
అక్కవి కలంబు దహనంబునందుచోట
వచ్చి కన్నీరుగార్తు రిప్పటికి జనులు
సూరయను రాయి కన్నులఁ జూచుకొఱకు
"గతికయైపోతె! నిన్నెట్లు గాంతు" మనుచు.
జనులు మఱికొందఱొక కొన్నిదినములేగ
సూరబూడిదయయ్యెడి చోటుజూచి
"గతికయైనది యాతఁడిక్కడనె యుంట
యేడిజూపింపు" మంచు నెగ్గాడరేమి ?
నేఁడుగానున్న నే యొకనాఁడుగాని
నాకలంబును నిప్పులనగ్గరఁగిపోవు
నాఁడు నన్నెంచి యెవ్వఁ డెట్లాడునొక్కొ !
యెంతసుఖమున నేను గ్రీడింతునొక్కొ !
ఇంక నక్కవి చావున కెవరొకాని
"యకయ నేనును కులటనే యయినదేమిః"

అనుచుఁ దనలోన మిక్కిలి వనరునంట
యీమెయే సూరగాఁబోలు నేమొచూడ.
ఏమొయని యింక ననుమానమేల పోవ?
నామెయే సూరయుంట సత్యమునగంటె
ఇప్పు డక్కవి బూదియయ్యెడినిచోట
నింపెడిని యుంట తనదుకన్నీరు నకట!
'అకట!' యననేల? నట్టిద్రోహాత్మకన్న
కథను వచ్చిన సూరనే గౌరవించి
యీమెమాటనె యింక నేనాఁడు వాఁడ
నాత్మ శాంతికి కొన్ని వాక్యముల నిట్లు.
"సూరబాల! నీవుచూఁడ శీలమువిడి
తయిన నీకుఁ బాప మంటఁబోదు
వసుధ నీదుగాథ పాఠంబుగా నుండు
నరయ నీయెడంద యద్భుతంబు.
రామకృష్ణ! నీవు ప్రథమమందున సూర
నెట్లుగనిన దేవుఁడేమి యనఁడు
నీమనంబు జగము నేర్చుకోదగినది
కౌఁగిలించు నిన్ను కవికులంబు.
నా కవిత్వమున్సైతము మీకథఁగొని
భువిని నేఁడొకయింటిదై పొలచినిలచెఁ
గలను జేబట్టు మాయమాత్ముఁలను గలిసి
యింకమీఁదట ముగిసిపోయెదనుగాక!"